# ఆధునిక కవిత - అభిప్రాయ వేదిక

34771

సంపాదకత్వం

ఆ చా ర్య తి రు మ ల

సేకరణ

మ ద్దా ళి ర ఘు రా మ్

ప్రచురణ :

కి న్నె ర ప బ్లి కే ష న్స్

2-2-647/153, సెంట్రల్ ఎక్సైజ్ కాలని

హైదరాబాదు-500013.



మద్రాసు మహానగరంలో

తెలుగు మల్లెలు విరియిస్తున్న

శ్రీ పి. వి. రమణయ్యరాజా గారికి

ఈ పూనిక

మా కానుక!

కిన్నెర ఆర్ట్ థియేటర్స్

# మొదటి మాట

ఇది మొదటి మాటే అయినా, అందరి మాటలు ఆకళించుకున్న తరువాత వ్రాస్తున్నమాట.

మా "కిన్నెర" మొదటి దశలో బాలసాహిత్యాన్ని అంచులుముట్ట అభ్యసించింది. ఇప్పుడు ఈ రెండవ దశలో ఆధునిక కవిత్వాన్ని ఆకళించుకొంది.

ఇందులో మా కిన్నెర నవనవంగా వివిధ శ్రుతులు సారించి విభిన్న రుచులు వెలువరించినా, సారించినగీతం ఒక్కటేనని ఆలోచనా దృష్టితో పరికించినప్పుడు తెలుస్తూంది.

ఆధునిక కవిత్వంలోని వివిధగతుల్ని వివిధ కవులు ప్రకటించినా, చివరకు చాలావిషయాల్లో అందరూ ఏకాభిప్రాయానికి రాగలగటం ఇందులోని ప్రత్యేకతగా ఆనందం కలిగిస్తూంది.

అందరూ విభిన్నతతో ఎవరికివారు, అతిరథులూ. మహారథులే అయినా తమరందరూ రథికులే అవడంలో సమానతను వారే గుర్తింపజేశారు.

ఇందులో శిష్టులూ, విశిష్టులూ వున్నా, అందరూ వశిష్టులే (వశి+స్థః) అనిపిస్తూంది. కొందరు ఏకత్వంలో బహుత్వం చూపిస్తే, మరికొందరు బహుత్వంతో ఏకత్వం చూపించారనిపించింది. ఇది ఒక ఆరోగ్యకరమైన తత్వంగా గ్రహించాలి.

ఒక్కచోట మాత్రం "సాంప్రదాయానికి విరుద్ధంగా వ్రాసిందే ఆధునికమౌతుందా?" అన్న ప్రశ్నలో శ్రీ దాశరథి, శ్రీ నారాయణరెడ్డి గార్లు విభిన్నులుగ కనిపించారు. శ్రీ దాశరథిగారి సమాధానంలో "సంప్రదాయానికి విరుద్ధంగా వ్రాసేదే ఆధునికం అని అన్నా, వారి రచనలు చూచినప్పుడు మాత్రం ఆధునికులుగా జమకట్ట లేము. ఆ కారణంచేత వారు మాటవరుసకు పైకి ఆధునికులే అనుకున్నా అంతర్వాణిలో సాంప్రదాయికు లనిపిస్తుంది.

ఇక ప్రతి విషయంలోనూ, ప్రతివారిలోనూ ఒక ప్రత్యేకత కన్పిస్తున్నా అందరిలోనూ సామూహికంగా నేను భావైకత్వాన్నే దర్శించ గలుగుతున్నాను. ఇది ఆరోహణా, అవరోహణా వివిధమార్గాల పరిపుష్టితో ఏకత్వాన్ని పరికించే చక్కని రాగప్రస్తారంగా మా "కిన్నెర" రసిక లోకానికి అందించటం చాలా ముదావహమైన విషయంగా భావిస్తున్నాను.

ముమ్ముందు 'మా కిన్నెర' ప్రౌఢ నిర్భర వయః పరిపాకంతో ప్రౌఢ రసానుభూతిని అందించగలదని ఆశిద్దాం.

హైదరాబాదు
1–9–1981

ఇట్లు
యం. వి. నారాయణరావు
అధ్యక్షుడు
కిన్నెర ఆర్ట్ థియేటర్స్

# కిన్నెర నివేదిక

తెలుగు సాహిత్యానికి ఎందరెందరో సేవచేశారు; చేస్తున్నారు. కవి, పండితుల సృజనాత్మక, విమర్శకశక్తుల్ని లోకానికి అందించి, చరిత్ర కెక్కిన ఉదార గుణ సంపన్నులు కూడా లేకపోలేదు.

కళా పోషకులు, కళాకార పోషకులు శారదా కటాక్ష వీక్షణానికి భిన్నులు కారు. సములు, సహోదరులు. ఆ పరస్పర పరిపోషక ప్రవృత్తే జాతీయ జీవన రంగంలో సంస్కృతీ సస్యాల్ని పండించింది; పండిస్తోంది. జాతి మనుగడను జాజ్వల్యమానం చేస్తూవుంది.

'కిన్నెర' — కళాకారుల, కళాకార పోషకుల సమిష్టి సంపద. ఈ ఉభయుల హృదయ పూర్వక కరచాలనమే 'కిన్నెర' కిన్ని విజయాలు సాధించి పెట్టిందంటే అత్యుక్తి కాదు.

ప్రముఖ సినీ దర్శకులు శ్రీ దాసరి నారాయణరావుగారు ఆవిష్కరించిన ఆచార్య తిరుమల గారి రచన "పల్లవి" తో "కిన్నెర పబ్లికేషన్స్" విభాగం పల్లవించి, యిప్పుడు శాఖోప శాఖలుగా విస్తరిస్తూవుంది.

శ్రీ ఎల్. మాలకొండయ్య గారి 'హంసధ్వని', (లలితగీతాల సంపుటి) డా. మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారి బిరుద ప్రదాన సభలో వెలువరించిన 'అభినవ త్యాగరాజు', రాష్ట్రీ రజతోత్సవాల్ని పురస్కరించుకుని, విశేష పరిశ్రమ చేసి వెలువరించిన 'వెండి వెన్నెల' (కవితా సంపుటి), బాలల సంవత్సర సందర్భంగా ఒక సదస్సు నడిపి, వెలువరించిన 'బాలసాహిత్యం - లక్షణాలు', (వ్యాస సంపుటి) — నేటివరకు కిన్నెర అందించిన పుస్తకాలు. ఈ సేవను రసజ్ఞులు, సహృదయులు గుర్తించటం, అభినందనలు కురిపించటం కేవలం కిన్నెర అదృష్టం.

ఈ "ఆధునిక కవిత - అభిప్రాయ వేదిక" — గ్రంథ ప్రచురణతో కిన్నెర ఒక చారిత్రాత్మక సంఘటన సృష్టించబోతూవుంది. ఆధునిక సాహిత్య సౌధానికి ఈ గ్రంథం ఒక మణిస్తంభం కాగలదని కిన్నెర ప్రగాఢ విశ్వాసం.

ఈ గ్రంథ నిర్మాణానికి ప్రణవం, ప్రాణం శ్రీ ఆచార్య తిరుమల గారు. ఆధునికంగా తెలుగు సాహిత్యంలో తలెత్తుతున్న సమస్యల్ని, సందేహాల్ని, నిరాశా నిస్పృహల్ని; ప్రోదిచేసి ఒక ప్రశ్నావళిని తయారుచేసి – ఒక ప్రణాళికని ఏర్పరచి, కొంతమంది మహనీయుల పేర్లు సూచించి, వారి అభిప్రాయాలు సేకరించినట్లయితే, ఆ అభిప్రాయాలతో ఒక క్రొత్త చరిత్రని తెలుగు సాహిత్యంలో సృష్టించవచ్చునని తిరుమలగారు చెప్పారు. వారి ఆలోచన కిన్నెరకు ఆమోదయోగ్యమే కాక ఆనందదాయకం కూడా అయింది. తెలుగుదేశంలో నలుమూలలా వున్న కవి పండిత విమర్శకులకి, చాలా మందికి పోస్టుద్వారా ప్రశ్నావళి పంపించాం. సమాధానాలు రాలేదు. రిమైన్డర్స్ ఇచ్చాం – అయినా ఫలితం శూన్యం. ఇలా కాదనుకుని వ్యక్తిగతంగా కలుసుకొని అభిప్రాయాలు సేకరించటం మొదలు పెట్టాం. వ్యయ ప్రయాసలకి గురి అయ్యాం. ఐనా యిలా ఈ పది మంది మహానుభావులతో ఈ పుస్తకం తయారవ్వటం విశేషంగానే చెప్పుకుంటున్నాం. ఆధునిక సాహిత్యానికి ఈ గ్రంథం విశ్వరూపమని చెప్పలేం కానీ అసంపూర్ణం, అసమగ్రం మాత్రం కాదని మనవి చేస్తున్నాం.

మద్రాసు నగరంలో సాంస్కృతిక, సాహిత్య కార్యక్రమాలకు అండగా నిలుస్తున్న కళాపోషకులు "రాజ్యలక్ష్మి ఫౌండేషన్" వ్యవస్థాపకులు ప్రముఖ వ్యాపారవేత్తలైన శ్రీ రమణయ్య రాజాగారు, ఉత్కృష్టమైన, విశిష్టమైన ఈ గ్రంథాన్ని స్వీకరించటం 'కిన్నెర' కి మరింత వన్నె చేకూర్చిందని మనవి చేస్తున్నాం. రాజావారికి మా కృతజ్ఞతాభి వందనాలర్పిస్తున్నా .

కిన్నెరకి వెన్నెముకగా నిలిచిన కిన్నెర అధ్యక్షులు శ్రీ యం. వి. నారాయణరావు గారికి, ఈ గ్రంథ ప్రచురణలో సహకరించిన ఆత్మీయులు శ్రీ త్రిపురాన రాఘవదాసు గారికి తమ తమ అభిప్రాయాలు అందించి, మా ఆశయ సిద్ధికి తోడ్పడిన ప్రముఖ కవి, పండిత విమర్శకులకు, ఈ గ్రంథాన్ని మీ కర కమలాల కందివ్వటానికి శ్రమించిన శ్రీ ఆచార్య తిరుమల గార్కి అందంగా ముఖ పత్రాన్ని తీర్చి దిదిన శ్రీ ఎస్. టి. వి. శేషు గారికి, ఇండియా బ్లాక్ మేకర్స్ శ్రీ సుబ్బారావు గారికి, ఇంకా ఎందరో .... అందరికీ కృతజ్ఞతలు తెల్పుకుంటూ –

మీ ప్రోత్సాహాన్ని, పరిపూర్ణ సహకారాన్ని ఆశిస్తూ

మ ద్దా ళి ర ఘు రా మ్

కా ర్య ద ర్శి

కిన్నెర పబ్లికేషన్స్

సెప్టెంబరు 1981

హైదరాబాదు-13

# పుష్పకం

ఈనాటి సాహిత్యలోకంలో ఉన్న అసంతృప్తిని, అశాంతిని, అజ్ఞానాన్ని అవహేళనని, దృష్టిలో ఉంచుకొని – అనేకానేక చర్చల తర్వాత, శ్రీ పి. ఎస్. గోపాల కృష్ణ (ఆకాశవాణి, మద్రాసు) గారి సహాయంతో ఒక ప్రశ్నావళిని తయారుచేసి, చి॥ మద్దాళి రఘురాం కి చూపించి "వీటి సమాధానాలు పుస్తక రూపంలో మనం లోకానికి అందజేయాలని" చెప్పాను. "మీరెలా చెబితే అలా" అన్నాడు రఘురాం నవ్వుతూ.

ఉత్సాహంగా కార్యరంగంలోకి దిగాను. కానీ అనుకున్నట్టుగా తెలుగు దేశంలోని మేధావు లందరి దగ్గర నుండి అభిప్రాయాలు రాబట్టలేక పోయాను. ఇందులో నా దురదృష్టం, మేధావుల ఔదాసీన్యం తప్ప ప్రయత్న లోపం మాత్రం లేదని సవినయంగా విన్నవించుకుంటున్నాను.

వ్యక్తిగతంగా శ్రమించాను. ఈ గ్రంథంలో మీకు కనిపించే మహనీయుల్లో శ్రీ వేదుల, శ్రీ మహీధర, శ్రీ సి. నారాయణ రెడ్డి, శ్రీ కుందుర్తి తమ తమ అభిప్రాయాలు పంపించారు. మిగిలినవారిని నేను స్వయంగా కలుసుకుని అభిప్రాయాలు వ్రాసుకున్నాను. శ్రీ రాయప్రోలు వారు, శ్రీ నార్లవారు విద్యా వయోవృద్ధులు కావటంచేత తమ తమ అభిప్రాయాలు యదేచ్ఛగా ప్రకటించారు. వారు నాకీ పూనికలో చేయూత నిచ్చి దీవించటమే మహద్భాగ్యంగా భావించాను. శ్రీ నార్ల వారు నా ప్రశ్నావళిని విని "మీరు వేసే ఈ ప్రశ్నలన్నిటికి మీరు సమాధానాలు రాబట్టి లోకానికి అందివ్వ గల్గితే – అదొక గొప్ప సారస్వత సేవే అవుతుంది. నా కెప్పుడూ ఇలాంటి ప్రశ్నలు ఎదురవ్వలేదు – నేనెప్పుడూ అంత లోతుగా ఆలోచనా చేయలేదు – మీ ప్రయత్నం మంచిది –" అని అభినందించారు. వారి అభినందన నా కెంతో సంతోషాన్నిచ్చింది. ఆ సంతోషంతోనే శ్రమించాను. కనీసం లోక ప్రసిద్ధులైన ఆధునిక సారస్వత మూర్తుల అభిప్రాయాలైనా సేకరించాలని తపించాను. శ్రీ శ్రీ గారిని ఒకానొక సందర్భంలో ఇక్కడే కలుసుకుని వారి అభిప్రాయాలు రాసుకున్నాను. ఆరుద్ర

గారి అభిప్రాయాల కోసం మద్రాసు వెళ్లవలసి వచ్చింది. ఆరుద్రగారు నాయెడ చూపించిన అభిమానం వ్యక్తిగతంగా మరువలేనిది. అలాగే ఈ గ్రంథాన్ని అంకితం తీసుకుంటున్న శ్రీ రమణయ్య రాజావారికి నాయెడ గల ప్రేమాభిమానాలకు నే నెప్పుడూ స్పందిస్తూ వుంటాను.

ఈనాటి ఒక సాహిత్య జిజ్ఞాసువులో చెలరేగిన అశాంతిని అణిచి, ఈ పుస్తకం పూరట కలిగించాలనే ఆకాంక్షించాను. అందుకు అభిప్రాయాలు నిష్కర్షగా, నిశితంగా, నిర్మమత్వంగా, నిరహంకారంగా ఉండాలనే ప్రార్థించాను ఆయా అభిప్రాయాలతో ఇప్పుడు నేను ఏ సిద్ధాంతాన్ని స్థాపించటానికి ప్రయత్నించటం లేదు. ఈ పుస్తకం మీద సహృదయ పాఠకుల అభిప్రాయాలు కూడా కావాలి. ఇలాంటి ప్రయత్నా లింకా ఎన్నో జరగాలి. అప్పుడు గానీ ఈ ఆధునిక తెలుగు సాహిత్యానికి ఒక ఆకారం గానీ, ఒక పేరు గానీ ఏర్పడవు. ఏడాదిపాటు శ్రమించి. తయారుచేసిన ఈ గ్రంథం నాకెంతో సంతృప్తినిచ్చింది. ఈ సంతృప్తిని నాకు మిగిల్చిన వద్దాళి రఘురాం కి కృతజ్ఞుణ్ని.

అవ్యాజమైన అభిమానంతో తమ అభిప్రాయా లందించిన సాహితీమూర్తులకు ప్రణామాలర్పిస్తూ

"విద్వానేన విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" —

అనుకుంటూ సెలవు తీసుకుంటాను.

ఇట్లు
విద్వజ్జన విధేయుడు
ఆచార్య తిరుమల
సంపాదకుడు

చైతన్య కళాశాల
హైదరాబాదు

## ఇందులో...

1. ఆచార్య రాయప్రోలు సుబ్బారావు
2. "ఆస్థాన కవి" - శ్రీ దాశరథి
3. శ్రీ. శ్రీ.
4. ఆరుద్ర
5. సి. నారాయణ రెడ్డి
6. దివాకర్ల వేంకటావధాని
7. గుంటూరు శేషేంద్ర శర్మ
8. కుందుర్తి ఆంజనేయులు
9. వేదుల సూర్యనారాయణ శర్మ
10. మహీధర రామమోహన్ రావు
11. నార్ల వెంకటేశ్వర రావు

— అభిప్రాయా లున్నాయి.

I A) తెలుగులో ఆధునిక కవిత్వం ఎప్పటినుండి మొదలయ్యిందని మీ రనుకొంటున్నారు ?

శ్రీ శ్రీ :

తోకచుక్క వెలువడ్డ 1910 లో. ఆనాడే గురజాడ ముత్యాలసరాలు గుచ్చాడు.

డా. దివాకర్ల వేంకటావధాని :

కందుకూరి వీరేశలింగం పంతులుగారు మొదట సంప్రదాయ కవిత్వమే చెప్పియుండిరి. కానీ, తర్వాత తమ అభిప్రాయమును మార్చుకొనినట్లు కనుపించును. వారి ''సరస్వతీ నారద విలాపము''లో ఆధునిక కవిత్వమునకు అవ్యవహిత పూర్వముగా నున్న కవుల కవిత్వమును విమర్శించిరి. అది, రస భావహీనము; శబ్దాలంకార ప్రచురమైన కవిత్వము. దానివలన సరస్వతి సౌందర్యము చెడినదని వారి అభిప్రాయము. దానికి ఆంగ్ల భాషా ప్రచారము కూడ తోడ్పడినది. అప్పటినుండి ఆధునిక కవిత్వము ఆరంభమైనదని చెప్పవచ్చును.

డా. సి. నారాయణరెడ్డి :

ఇరవయ్యో శతాబ్ది తొలి పదిలో. రాయప్రోలు 'లలిత' స్వరంలో; గురజాడ 'ముత్యాల సరం' తో-

గుంటూరు శేషేంద్రశర్మ :

కాల చిహ్నాలను బట్టి ఆధునికతను గుర్తించేటట్లయితే, తెలుగులో గురజాడ అప్పారావు గారికి పూర్వం ఆధునిక లక్షణాలున్న సాహిత్యరచన చేయబడినట్లు ఏ సాక్ష్యము లేదు.

డా. దాశరథి :

గురజాడ నుంచి.

కుందుర్తి :

ఆధునిక కవిత్వ లక్షణాలు అని నేను అనుకుంటున్నవి గురజాడలో తొలిసారిగా తొంగి చూశాయి. ఎప్పుడంటే అయన శబ్దాడంబర ప్రధానమైన

ఛందోబద్ధ సంప్రదాయ కవిత్వాన్ని వదలి జానపద సాహిత్య సంబంధమైన ముత్యాల సరాన్ని చేపట్టి, జానపద కవితా సహజ లక్షణమైన సారళ్యాన్ని స్వీకరించి, కవితలో సమాజ వాస్తవాల చిత్రణకు ఉద్యమించినప్పుడు.

శ్రీశ్రీ ప్రవేశించిన తర్వాత సారళ్యం మొదలగు అంశాలు కొంచెం వెనుక బడినా, సమాజమూ దాని శ్రేయస్సూ అనే అంశాలకు అత్యంత ప్రాధాన్యం వచ్చి ఆధునికతకు సంపూర్ణ స్వరూపం వచ్చింది.

ఆరుద్ర :

వీరేశలింగం పంతులుగారు కవుల చరిత్ర రాస్తూ ఆధునిక యుగమని మూడవ భాగాన్ని రాశారు. అందులోని కవుల పేర్లు ఈవేళ చూస్తే వాళ్ళంతా మనకి ప్రాచీనుల్లాగ కనబడతారు. ఆధునిక మన్న మాట ఎప్పుడూ సాపేక్షం, 13వ శతాబ్దంలో పాల్కురికి సోమనాథుడు ఆధునికుడు. అలాగే శ్రీనాథుడు. దిగంబర కవులు, విప్లవ కవులు రేపటికి పాతబడిపోతారు. ఎన్ని శతాబ్దాల క్రింద రాసినా రేపటికి కొత్తగా వుండేదే ఆధునికం !

మహీధర రామమోహనరావు :

ఈ నాటి మానవుని ఆశలను, ఆశయాలను, సుఖదుఃఖాలను, కోప తాపాలను ఆత్మీయతలను, అనుతాపాలను వ్యక్తం చేస్తున్న రచనను ఆధునికం అనాలి.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

కవిత్వము అన్నా సారస్వత మన్నా ఒకటే. సరస్వతికి సంబంధించినది సారస్వతమౌతుంది. సరస్వతి (సరస్ + వతి) సరస్సు గలది. సరస్సు అనగా ప్రవాహము. ప్రవాహము కలది అనునది సారస్వతము అను మాటకు అర్థము. నిత్యప్రవాహంతో సారస్వతము ప్రగతిశీల మైనది. కాగా, దీనికి ప్రాచీనత, ఆధునికత అను విభాగ మేర్పరచడం కూడదు. ఎప్పుడూ ప్రవహించునదివలె సారస్వతము కూడ నిత్య నూతనముగా ఉండుచూనే యున్నది. కాని, శైలి యొక్క, ఛందస్సుయొక్క ప్రాచీన, నవీనతల ఆధారంగా కవిత్వమునకు కూడ ప్రాచీనాధునికత్వ భేదములు చెప్పబడుచున్నవి. కవిత్వము ప్రతిభా సమన్వితము. ప్రతిభ నిత్య నూతనము. కాన ఆధునిక కవిత్వము ఆదికాలము నుండియు ప్రగతితో వచ్చుచూనే యున్నది.

'కవి' అనగా "కం వయతీతి కవిః" అనగా కం=సుఖమును వయతి= నేయువాడు అని, సుఖమును అనగా ఆనందమును, నేయువాడు అనగా శిల్పమును చేయువాడని అర్థము. ఈ వ్యుత్పత్త్యర్థముతో ఆనందానుసంధానము చేయుట కవితా లక్షణము. అట్టి లక్షణములో ప్రాచీనత, ఆధునికత అను భేదములేదు. అనగా కవితా ముఖ్య ధర్మమైన ఆనందాను సంధానము నాడూ-నేడూ ఒకటే. కాన ప్రాచీనాధునిక భేదము లేనే లేదు. కాని ఆనందము అను మాటకు ప్రాచీనులు ఐహికానందము కాక ఆముష్మికానందము అను అర్థము ప్రధానముగా స్వీకరించి, ఆ రకమైన ఆనందమును కల్గించు కావ్యములు రచించిరి. అట్టి కావ్యములే భారత, భాగవత, రామాయణములు. తరువాతి వారు ఐహికానందమును ధర్మముతో జతచేసి తదనుగుణముగ కావ్యములను రచించిరి. అటు తరువాతి వారు ధర్మ ప్రసక్తి లేకుండ సంఘదృష్టితో సాంఘికానందమును ప్రధానము చేసి కావ్యములు వ్రాసిరి. ఆటు పిమ్మట పాశవికానందము కూడ కవిత్వములో చోటు చేసుకున్నది. ఈ విధముగా కవి తన దృక్పథమును మార్చుకొని రావడం వల్ల ప్రాచీనాధునిక భేదం కవిత్వమున కేర్పడింది. కాని కవితా ధర్మమైన ఆనందాను సంధాన మన్నింటను ఒకటే. అనాది నుండియు ఆధునిక కవిత్వము వచ్చుచున్నదని దీనివలన గుర్తింపవలెను.

(B) 'ఆధునిక కవిత్వం' అంటే మీదృష్టిలో ఏమిటి ?

**డా. దాశరథి :**

ఆధునిక కవిత్వం అంటే ప్రజలను గురించి, లేదా మానవ కల్యాణం కోసం వ్రాసేదీ, కొత్తదనం కొద్దో, గొప్పో కలదీ.

కుందుర్తి :

అధునిక కవిత్వం రాయడం అంటే కవి తాను సమాజంలో ఒకడుగా భావించుకొని, వర్తమాన సమాజ స్వరూపాన్ని మార్చే కృషికి దోహదకరంగా కవితలు రాయడం. తాను యితరుల కంటే అధికుడననే అహంకారం ఆధునిక కవికి పనికిరాదు. కావ్య వస్తువునూ, దానికి సంబంధించిన Expression నూ కూడా ప్రజలనుండి గ్రహించడానికి ఏది సిద్ధంగా వుందో అది ఆధునిక కవిత్వం. ఆధునిక శబ్దం వాడడంవల్ల యిది కాల సంబంధి ఏమో అనే అనుమానం కొందరికి రాకుండా దీనిని ప్రజా కవిత్వం అంటే మంచిది. మార్గ కవిత్వంలో భాగమైన ప్రజా కవిత్వం జానపద సాహిత్యంలో పూర్తిగా చేరలేనిది.

డా. సి. నారాయణరెడ్డి :

'అధునా' అంటే నేడు, 'ఆధునికం' అంటే నేటిది. ఆధునిక కవిత్వం అంటే స్థూలంగా నేటి కవిత్వమన్నమాట. అయితే, సమకాలీన కవిత్వమంతా ఆధునిక కవిత్వం కాదు. మరో 'రామాయణం', మరో 'బ్రహ్మాండ పురాణం' ఈనాడు రాసినా అది పాత కవిత్వమే. కొన్ని కొత్త భావాలుండొచ్చు. సరికొత్త వ్యాఖ్యానాలుండొచ్చు. నా దృష్టిలో ఆధునిక కవితకు మూడు లక్షణాలుండాలి.

1. వస్తు నవ్యత 2. సంవిధాన నవ్యత 3. అభివ్యక్తి నవ్యత.

డా. దివాకర్ల :

సంస్కృత ప్రభావము తగ్గి ఆంగ్ల ప్రభావము అధికమగుట, దీర్ఘములైన వర్ణనములు లేకుండుట, భాషా ఛందస్సులలో కొద్దిగా మార్పు కనిపించుట. సామాన్యులను కూడ నాయికా నాయకులను చేయుట, ఆధునిక కవితా లక్షణములు.

శ్రీ శ్రీ :

సమకాలీనులంతా ఆధునికులు కారు. నేటి జీవిత సమస్యల పరిష్కారానికి చేసే ప్రయత్నమే ఆధునిక కవిత్వం. విశ్వనాథ సమకాలీనులలో ప్రాచీనుడు; ఆరుద్ర ఆధునికుడు.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఈ ప్రశ్న ప్రకారం కవిత్వాన్ని విశ్లేషించి పరిశీలించాలి. కవిత్వానికి మూడు శరీరాలున్నట్లు భావించవచ్చు. పైకి కనిపించే బహిశ్శరీరం సర్వ సామాన్య జన అవగాహనకు అందే నాగరికతా సంబంధమైన లక్షణాలు. ఆహార విహారాదులు, వస్త్రాది అలంకరణలు, గృహ గ్రామ పట్టణాది నిర్మాణాలు-ఇత్యాది నిత్య జీవన విశేషాలు. కవిత్వం యొక్క రెండవ శరీరం కించిదంతర్గతంగా ఉండేది. ఇది మనుష్య సంస్కార సంబంధి లక్షణ జన్యమైనది. తండ్రిని కొడుకు గౌరవించటం, అగ్రజుణ్ని గౌరవించటం, ఒకే భార్యకు బద్ధుడై వుండటం, స్నేహధర్మం, ప్రభుత్వ ప్రజల సంబంధం, స్వామి, సేవక సంబంధం-ఇత్యాది అంతస్సార జన్యమైన విలువల సముదాయం.

నన్నయగారి కవిత్వం తీసుకుంటే అందులో కిరీటాలు, ఖడ్గాలు, సింహాసనాలు, గజాశ్వాది వాహనాలు, కేశజాలంలో పుష్పాలంకరణలు, ఇత్యాదులు

ఆయన కవిత్వపు బహిశ్శరీరంలో కనిపిస్తాయి. అట్లాగే దాని అంతశ్శరీరంలో పితృవాక్య పాలన, ఏకపత్నీ వ్రతం. సేవక భక్తి, ప్రభుభక్తి, సొంత ఆస్తి, ఇత్యాది రాజకీయ,సామాజిక,ఆర్థికవిలువలు కనిపిస్తాయి ఈ బహిశ్శరీరంలో అంతశ్శరీరంలో కనిపించిన లక్షణాలేవీ యీనాడు రాసే కవుల్లో కనిపించవు. ఈనాడు టెర్లిన్‌షర్టు,క్రాఫింగ్,నవీనఫర్నిచరు, ఇళ్ళు,రస్తాలులాంటివి కనిపిస్తాయి అలాగే పితృ వాక్య పరిపాలన కూడా ఆనాటి దృఢవ్రతంకాదు యీనాడు. ప్రభుభక్తి యీనాటి రాజకీయ విలువకాదు. ఈనాడు దాని స్థానంలో ప్రజాస్వామ్యం వచ్చింది. ఆనాటి స్వామి-సేవక సంబంధం స్థానంలో యీనాడు సర్వమానవ సమానత్వం వచ్చింది. ఆనాటి వ్యక్తిగత ఆస్తికి బదులు సామాజిక ఆస్తి యీనాటి ఆర్థిక విలువ. ఇప్పటికే లోకం ఈ విలువను భూగోళం మూడు వంతులు భాగంలో అమలు జరిపింది కూడా. ఈ విలువను నన్నయగారి కాలంలో ఉద్ఘోషిస్తే నిండు కఠిన శిక్షకు పాత్రుడవటంలో సందేహం లేదు. ఈ రెండు శారీరకలక్షణాలూ కేవలం దేశ, కాల జన్యమైనవి అనేది సామాన్య విజ్ఞానం. కనుక కవిత్వం ఈ లక్షణాలచేత ఆధునిక లేక ప్రాచీన లక్షణమని విభజించి, గుర్తించబడవచ్చు.

కానీ, ఈ రెండు శరీరకోశాలను దాటి యింకా లోతుకు వెళ్ళినప్పుడు వుండే మూడవ ప్రదేశం-అది శరీరమా? ఆత్మా? అని నిర్ణయించటానికి వీలు కానిది. పై రెండు దేశ కాల జన్య సందర్భ, సన్నివేశాల్లో మనిషిపొందే గాఢానుభూతి నుంచి ఉత్పన్నమయ్యే విచిత్రమైన మాటో, లేక దృశ్యమో, ఏదైతే ఉక్తమై పాఠకుణ్ణి ఆశ్చర్యాఘాతానికి గురిచేస్తుందో-ఆ ప్రాణతుల్యమైన వైచిత్రి, ఆశ్చర్యాహ్లాదజనకమైన భంగిమ-అది ఎప్పుడూ దేశ కాలాతీతంగానే వుంటుంది. ఈ మూడవ వస్తువు కవిత్వపు మూడవ శరీరం అనగలమా? లేక కవిత్వపు ఆత్మ అందామా? పైరెండు శారీరక లక్షణ సముదాయాలూ దేశ కాలానుగుణంగా మారుతూ వుంటే-యీ అంతరంగిక విచిత్ర అనిర్వచనీయ పదార్థం, ఏదైతే కవియొక్క ఆత్మిక పదార్థమో, అది మాత్రం దేశ కాలాబాధ్యంగా, శాశ్వతంగా వుంటుంది. కనుకనే ఎంతో ప్రాచీనుడైన వాల్మీకిని చదివి, యీనాడు కూడా 20వ శతాబ్దంలో మనం ఆహ్లాదపరవశుల మౌతున్నాం. వైదిక కవితలు కూడా మనల్ని ఆశ్చర్యబంధంతో కట్టి పడవేస్తున్నాయి.

దీనివల్ల తేలేదేమిటంటే, దేశ కాల సంబంధమైన కవిత్వపు బహిరంతర శరీర ద్వైవ లక్షణాలు, ఆ భాష, మనకు సంబంధించినవి కాకపోయినప్పటికీ,

వాటి కావ్య ధర్మంచేత అవి మనల్ని స్వపాశ వశం చేసుకుంటున్నాయి. కనుక్క కవిత్వపు ఆధునికత, ప్రాచీనత, రాజకీయ, సామాజిక, ఆర్థిక విలువల చేతనే నిర్ణయించబడగలదు కానీ కవిత్వపు అంతస్సత్త్వమైన కావ్య ధర్మంచేత—కవిత్వానికి కాల విభజన కుదరదు.

ఆరుద్ర :

పై సమాధానం లోనే దీనికి కూడా సమాధానం చెప్పాననుకుంటాను. సూతుణ్ని చూసి శౌనకాది మహామునులు ఒక కథ చెప్పమన్నారు. ఎలాంటి కథ కావాలని అడిగాడు. వాళ్ళ కోరికని నన్నయగా రిలా రాశారు :—

ఏయది హృద్యము పూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘ నిబర్హ
మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్ !!

అన్నారు. ఇవే మాటల్ని మళ్ళా తిక్కన్నగారు ఆఖరి పర్వంలో పేర్కొన్నారు. ఆనాటి నుంచి యీనాటి దాకా అపూర్వం ఏదైతే అదే ఆధునికం అవుతుంది.

వేదుల :

ప్రగతి శీలత్వమే అధునిక కవితగా చెప్పవచ్చును.

నార్ల వెంకటేశ్వరరావు :

నేటి మన ఆధునిక జీవిత రంగంలో వీలైనంత సులభంగా, వీలైనంత అధికంగా, వీలైనంత త్వరితంగా, వీలైనంత ధనాన్ని మూటగట్టాలన్న తాప త్రయం కనబడుతూన్నది. ఇదే జాడ్యం సాహిత్య రంగంలో కృషిచేస్తున్న వారిలో కూడా చాలా వరకు కనబడుతూ వున్నదంటే—అందుకు నన్ను మన్నించాలి.

ఆలోచన నుంచి, తపన నుంచి, ఒక విధంగా తపస్సు నుంచి సాహిత్యం వెలువడాలి. ఇందుకు మారుగా ప్రస్తుతం వీలైనంత తేలికగా వీలైనంత హెచ్చు ఖ్యాతిని సంపాదించటానికి తాపత్రయం స్పష్టంగా గోచరిస్తూవున్నది.

మహీధర రామమోహనరావు :

అయితే 'ఈనాడు'—'మానవుడు' అనే మాటల అర్థం ఏమిటని ప్రశ్న తెచ్చేవారున్నారు. ఏనాటి కానాడు, ఎక్కడి కక్కడ ఈ మాటలకు పరిధులు

పరిమితులూ వున్నాయి. ఈ విశ్వంలో ప్రతి ఒక్కటీ ద్వైవిధ్యం గలదే. ప్రతి ఒక్కటీ సాపేక్షకమే గాని నిరపేక్షం కాదు. ఆ దృష్టితోనే మన ఆలోచన సాగాలి.

**C 1981 లో ఛందోబద్ధ కవిత్వం రాసేవాళ్లు ఏ తెగకు చెందిన కవులవుతారు ?**

**డా. దివాకర్ల :**

కవిత్వము ఛందస్సు మీదనే ఆధారపడిలేదు. రసాత్మకమైన వాక్యమేదైననూ కవిత్వమే అగును. ఛందోబద్ధమయ్యు రసహీనమైన కవిత్వము వ్రాయువారు ఛందోవేత్తలగుదురు కాని కవులు కాజాలరు. కొందరు సలక్షణమైన భాషా ఛందస్సులలో ఆధునికభావము లిమిడ్చి కవిత్వము వ్రాసినవారు కలరు. వారిని "నియోక్లాసిసిస్ట్స్" అనవచ్చును.

**శ్రీ శ్రీ :**

కావల్సింది కవిత్వ స్వరూపం కాదు; స్వభావం. ఛందస్సేదయినా సామాజిక స్పృహ ముఖ్యం. మాత్రా ఛందస్సుల్లోనే మళ్ళీ రామాయణం రాస్తే అది ఆధునిక కవిత్వం అనిపించుకోదు.

**డా. సి. నారాయణరెడ్డి :**

తెలుగులో ఛందస్సు రెండు రకాలుగా వుంది. 1. అక్షర గణ ఛందస్సు; అంటే ఉత్పల చంపకాది వృత్తాల్లో ఉండేది. 2. మాత్రా ఛందస్సు; ఇది రగడల్లో గేయాల్లో ఉండేది. ప్రశ్న ఈ రెంటిలో దేన్ని ఉద్దేశించిందో స్పష్టంగా లేదు.

**కుందుర్తి :**

1980 లో ఛందోబద్ధ కవిత్వం రాసేవాళ్ళు తమ కళ్ల ముందు వచ్చిన మార్పును గుర్తించలేని వాళ్లు; లేదా గుర్తించడానికి అనేక కారణాల వల్ల యిష్టపడక మొండికెత్తినవాళ్ళు. సాహిత్యపు విలువలలో వచ్చిన మార్పుకు అనుగుణంగా రూపంలో మార్పు వస్తుందని గుర్తించలేనివాళ్లు. ఛందోబద్ధమైన రూపం వున్నంత కాలం ఆలోచనా రీతిలో విప్లవాత్మకమైన దృష్టి ఏర్పడదు. కాశీకి కాలినడకన వెళ్ళితేనే పుణ్యం వస్తుందని ఇప్పటికీ నమ్మేరకం మనుషులు వీళ్ళు.

డా. దాశరథి :

పాత తరానికి చెందిన వారు అవుతారు.

గుంటూరు శేషేంద్రశర్మ :

శిలా శాసనాల భాషలో రాస్తూ, ఈనాటి జీవిత సన్నివేశ అనుభూతి మూలక ఆదేశంతో ఒకడు కవిత్వం ఛందస్సులో చెప్పాడు అందులో రాజకీయ, సామాజిక, ఆర్థిక విలువలు సమకాలీనములే అవుతాయి. దీన్ని ఛందస్సు, శిలాశాసన భాషల కారణంగా ఆధునిక కవిత కాదు అంటే అంత నిష్కర్షగా కుదరదు. ఛందస్సు కవిత్వంలో ఆధునికతకు భంజకం అనటం అంత శాస్త్ర వివేచనా సమ్మతమైన మతంకాదు.

సినిమా పాటల్లో ఛందస్సు వుందా? లేదా? ఛందస్సుకు ప్రాణం లయ. కనుక లయాత్మకరచనలన్నీ ఛందోబద్ధ రచనలే. అన్నమాచార్యులు, త్యాగరాజు రామదాసు మొదలైన కవులు రాసిన కీర్తనల్ని ఛందో రహితమైన వచన కవితలు అనలేము కదా !

ప్రపంచంలో ఆధునిక కవితకు మూల పురుషులైన బోదిలేర్, ఆది ఫ్రెంచ్ సింబలిస్టులు, తత్పూర్వం ఇంగ్లాండులో కానీ యూరపులో గానీ వచ్చిన రొమాంటిక్ కవులు, ఛందోబద్ధ రచనలే చేశారు. ఇలాంటి వాస్తవాల చేత కూడా ఛందస్సు కవిత్వంలో ఆధునికతకు భంజకం అనుకోవటం అశాస్త్రీయం. కొందరు ఛందస్సులో విప్లవ కవిత్వం చెప్పకూడదనుకోవటం కూడా మూర్ఖ లక్షణం. అక్టోబరు రివల్యూషన్‌లో పాల్గొన్న రష్యన్ మహాకవి మయాకోవిస్కీ ఛందోబద్ధమైన కవిత్వమే చేప్పాడు. ఆయన కవిత్వం ఎలారాయాలనే వ్యాసం రాసి దానికి పేరు "How to make Verses" అని పెట్టాడు. ఆయన కవిత్వాన్ని ఛందో రహితంగా వూహించనే లేడు.

దీనిఅర్థం, ఒక రచనకవిత్వం అనటానికి ఛందస్సు అనివార్యం అనిమాత్రం కాదు. ఛందస్సు వల్ల కవిత్వానికి కలిగే లాభాలు—ఒకటి దీర్ఘాయుష్షు; రెండవది—కవిత్వం చెబుతున్న విషయం పాఠకుడిలో మరింత అవగాహనా లోతులకు పోవటం దానికి సంగీతాన్ని కూడా జోడిస్తే, కవిత్వం దేన్ని సమాజం అవలంబించాలని, దేనిమీద సమాజానికి నమ్మకం కుదరాలని ఆశిస్తుందో, ఆ ఆశ సమగ్రంగా సఫలమవుతుంది. ఉర్దూ మహాకవి గాలిబ్‌ను వింటూ ఉర్దూ సమాజం ఎందుకు ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తుందో, ఈ మర్మం చేతనే గ్రహించవచ్చు, ఈ మర్మంచేతనే ఉర్దూ సమాజ నాగరికత, కవితకే నాగరికతేకానీ, ధార్మిక రాజకీయ నాగరికత, కాదనే సూక్ష్మం కూడా గ్రహించ వచ్చు.

కనుక, ఈనాడు ఛందస్సులో రాసినప్పటికి అందులో ప్రతిపాదింపబడిన విలువలు ఆధునిక కాలానికి చెందినవైతే ఆ కవిని ఆధునిక కవి అనే అనాలి.

**ఆరుద్ర :**

ఛందస్సు కవిత్వానికి ఒక వాహనమే కాని యింకేం కాదు. పాతబడ్డ వాహనాలెక్కి యీనాటి నగరాల్లో ఎవరైన ప్రయాణం చేస్తే ఎబ్బెట్టుగా వుంటుంది. ఐతే సందర్భాన్ని బట్టి, ఒక ప్రముఖుణ్ని ఏనుగెక్కించి వూరేగిస్తే అది ఎబ్బెట్టుగా వుండదు. అలాగే అందలాలూ, పల్లకీలు ఎక్కినా, పేరు చెప్పకుండా పాత ఛందస్సుల్లో పద్యాలు రాస్తే వచన పద్యంలా అచ్చువేస్తే. ఎంత మంది పోల్చుకో గల్గుతారు? నా 'త్వమేవాఽహం' లో నేను వాడిన పాత ఛందస్సులు నేను చెప్పేదాకా పరిశోధకులకే తెలియలేదు.

**డా. వేదుల సూర్యనారాయణశర్మ :**

ఛందస్సును బట్టి కవుల తెగలు నిర్ణయించడం తగదు. కవి మనో ధర్మమును, ప్రతిభను బట్టి తెగలు నిర్ణయించిన యెడల ఛందోబద్ధత వలన ప్రాచీనాధునిక భేదము చెప్పదగదు. 1930 నాటి కవులు నా దృక్పథములో సాంఘిక ధార్మికానందమును వెలువరించు తెగకు చెందిన కవులు.

**మహీధర రామమోహనరావు :**

ఛందోబద్ధం, మాత్రాబద్ధం, లయబద్ధం వగైరా పదాలు రచన రూపాన్ని తెలిపే పదాలు. వస్తువుకీ, రూపానికీ అనురూప్యత వుంది. వస్తు స్వభావం రూపాన్ని ముందుకు తెలుస్తుంది. అయితే వస్తు స్వభావంలో వచ్చే పరిణామాలు సరిహద్దులు గీసినట్లు రూప పరిణామాన్ని వెంటబెట్టుకురావు. అటూ, ఇటూ కూడ పరావరణ ప్రవేశాలు వుంటాయి. అందుచేత ఆధునికతను నిర్ణయించడంతో రూపానికి ప్రాముఖ్యం ఇవ్వలేము.

## సంప్రదాయానికి విరుద్ధంగా రాసిందే ఆధునిక మౌతుందా?

**డా. దాశరథి :**

భిన్నంగా (విరుద్ధంగా) రాసేది ఆధునికం అవుతుంది.

**డా. సి. నారాయణరెడ్డి :**

ఆధునికతకు భిన్నంగా ఉన్నదల్లా ఎలా సంప్రదాయం కాదో, సంప్రదాయానికి విరుద్ధంగా ఉన్నదల్లా ఆధునికత కాదు.

కుందుర్తి :

ప్రతి కవీ తనకు చేతనైనంతలో సంప్రదాయాన్ని మార్చటానికే ప్రయత్నిస్తాడు. అందుకనే ప్రతివాడూ నేను ఆధునికుణ్ణి అని ప్రకటించు కుంటాడు. కొందరు మార్చాలనే స్పృహ లేకుండానే కాల ప్రవాహానికి కట్టు బడి మార్పుకు కొద్దిగా లోనవుతారు. క్రొత్తదనాన్ని కోల్పోయినపుడు ప్రతిదీ సంప్రదాయంలో భాగమైపోతుంది. అందువలన క్రొత్తను సృష్టించాలంటే సంప్రదాయాన్ని నిరాకరించవలసిందే. అయితే ఎంతవరకు అవసరమో అంత వరకే అది నిరాకరించబడుతుంది. అందులో మంచి ఏదైనా వుంటే దానిని త్రోసివేయడం అనవసరం.

శ్రీ శ్రీ :

సంప్రదాయాలు కూడా మారుతూనే వుంటాయి. సహగమనం ఒకప్పుడు గొప్ప సంప్రదాయం. దాన్ని సమర్థించాలా? వ్యతిరేకించాలా? అలాగే విడాకులు ఆధునిక సంప్రదాయం. దీన్ని ఒప్పుకొనే వారూ వున్నారు. తప్పు అనే వారూ వున్నారు. దారిద్ర్యం పూర్వ కర్మ ఫలితం అనే వారున్నారు. అందుకు అంగీక రించరు మార్క్సిస్టులు. అందుచేతనే పాత సంప్రదాయాల మీద తిరుగుబాటు ఆధునిక కవిత్వం.

డా. దివాకర్ల వేంకటావధాని :

ఆధునిక కవిత్వము భావముల మీద ఆధారపడియున్నది. - ఆధునిక రాజకీయ, సాంఘిక పరిస్థితులు ప్రతిబింబింపజేయునట్టి భాషా విషయమున కూడ కొంత స్వాతంత్ర్యము వహించునట్టియు, కవిత్వమే ఆధునిక మగును. ఆధునికులలో కూడ సంప్రదాయములను పాటించిన వారున్నారు.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఇందులో ఒక ప్రశ్న పుడుతుంది. సంప్రదాయంలో ఆధునికత లేదా? సంప్రదాయం అంటే కేవలం ప్రాచీనవిలువల సముదాయమనుకోవటం హేతువాద విరుద్ధమైన ఆలోచనా ధోరణి. సంప్రదాయంలో ప్రజా శ్రేయస్సుకు అవసర మైన దీర్ఘకాలిక అనుభూతి మూలక గుణపాఠాల సముదాయమే సంప్రదాయం యొక్క సారాంశమని తేలుతుంది. కొంచెం లోతుగా ఆలోచిస్తే— ఈ పాఠాల్లోంచి పుట్టి ప్రతిష్ఠితమైన విలువలు, ఆచార వ్యవహారాలూ అన్నీ శాశ్వత ధర్మత్వ మున్నవి అనుకోనక్కరలేదు. దేశకాల వశంగా కొన్ని శ్రేయస్కరం కాకుండా

పోతూ వుంటాయికూడా. అప్పుడు సంప్రదాయంలో కొత్తవి చేరుతుంటాయి. ఫలితంగా, సంప్రదాయం ఒక నదీ ప్రవాహం లాంటిదే అవుతుంది. కానీ, ఏ ప్రవాహంలో జలం శాశ్వతంగా నిలువుండదో, అలాంటి నదీ ప్రవాహమే కాని స్థిర జలరాశి అయిన తటాకం లాంటిదికాదు. కనుక సంప్రదాయ లక్షణాన్ని అర్థం చేసుకోవటం మొదట అవసరం.

ఒక కవితలో కొడుకు తండ్రిమీద విరోధం వహిస్తాడు. ఇది సంప్రదాయ విలువకు విరుద్ధం కనుక ఆ లక్షణం చేతనే ఆధునిక కవిత్వం అంటామా? అలా అన్నట్లయితే, అట్టి ఆధునికత ఒక సాహిత్యపు విలువగా పరిగణించవచ్చా? కనుక కేవల సంప్రదాయ విరుద్ధత ఒక రచనకు ఆధునికతను ఆపాదించదు. కారణం యీ విలువల్లో కూడా కొన్ని శాశ్వత కాలీన విలువలు, కొన్ని తత్కాలీన విలువలు ఉన్నాయి. పుత్ర-పితృప్రేమ, దాంపత్య ప్రణయం, స్నేహధర్మం లాంటి పునాది గతమైన మానవీయ సాంస్కారిక లక్షణాలు శాశ్వత విలువలైతే ప్రజాస్వామ్యం, సొంత ఆస్తి-ఇత్యాది రాజకీయ, సామాజిక, ఆర్థిక లక్షణాలు తత్కాలీనములౌతాయి. కవితలో తత్కాలీనత ప్రతిబింబించినంత మాత్రాన లేక శాశ్వత కాలీన తత్కారణంగా ప్రాచీన విలువలకు విరుద్ధంగారాస్తే అందుచేతనే ఆధునిక కవిత్వం అనటం చాలా బాలక బుద్ధి అనుకోవాలి.

**ఆరుద్ర :**

సంప్రదాయానికి విరుద్ధంగా రాస్తే ఆధునికం అవ్వదు. పాత సంప్రదాయాన్ని జీర్ణం చేసుకుని కొత్త సంప్రదాయానికి పునాదులు వేసేదే నిజమైన ఆధునికం.

**డా. వేదుల సూర్యనారాయణశర్మ :**

సంప్రదాయాన్ని విడవడం ఆధునికానికి లక్షణం కాదు. వినూత్న భావ నిర్మాణం ఆధునికం. జాషువా మొదలగు వారు ఆధునిక కవులే.

(E) ఉన్న పద్ధతిని విడిచి ఒక కొత్త పద్ధతిని పాటించటమే ఆధునికత అయితే—పాల్కురికి సోమన నుండి వుంది. దాని మాటేమిటి?

**డా. సి. నారాయణరెడ్డి :**

'ఆధునికత' అనే దృక్పథం ఇప్పటిది. ముఖ్యంగా ఈ యుగానికి

సంబంధించింది. ఈ కొలబద్దతో కొత్త రీతులన్నిటిని కొలవటానికి వీల్లేదు. పాలకుర్కి సోమన్నది అప్పటికి కత్తిలా పదునైన గొంతుకే.

డా. దివాకర్ల :

నిజమునకు ఆధునికత అనునది కాలమును బట్టి మారుచుండును. సంస్కృత భాషను విడిచి తెలుగులో భారతము వ్రాసిన నన్నయ అప్పటికి ఆధునికుడే. శివకవుల కావ్యములు అప్పటి పరిస్థితులను బట్టి అభ్యుదయ దృక్పథమును సూచించును. అట్లే అనువాద పద్ధతిని విడిచి స్వతంత్ర గ్రంథములు వ్రాసిన ప్రబంధ కవులు అప్పటికి ఆధునికులు గానే పరిగణింపబడిరి.

శ్రీ శ్రీ :

ఒక్క సోమనాథుడే కాదు—కావ్య జగత్తులో ఎప్పుడూ యద్భవిష్యులు అనాగత విధాతలు వుంటూనే వుంటారు. ఈ రెంటిలో మధ్యే మార్గం అనుసరిస్తారు ప్రత్యుత్పన్నమతులు, ఈ మూడు చేపల కథ మానవ జీవిత సమస్తానికి కూడా వర్తిస్తుంది.

గుంటూరు శేషేంద్రశర్మ :

పాల్కురికి సోమన ఉన్నపద్ధతిని విడిచి కొత్త పద్ధతిని అవలంబించాడు. ఈ కవిలో విశేషం ఏమిటంటే ఒక్క రచనాధోరణిలోనే కాకుండా తత్కాలీన సంప్రదాయ విలువల విషయంలో కూడా విరుద్ధ మార్గాన్ని అవలంబించాడు. కనుక ఆయన్ని సమగ్రమైన ఆధునిక కవి అనాలి. ఐతే, ఇంకా విశేషమేమిటంటే ఆయనలో కవిత్వం ఎక్కడుందో కనిపించదు. పేజీలు పేజీలు-లింగ మహిమ, రుద్రాక్షమహిమ, విభూతిమహిమ లాంటి విషయాల మీద పొడి వచనపు రచన అంతం లేకుండా సాగిపోతూ వుంటుంది. ఈనాటి వీర రాజకీయ కవులకు తుల్యుడు. కవిత్వం ఉన్నా లేకపోయినా. ఈనాటి వీర వచన కవులు ఆ వీరత్వం చేతనే ఆధునిక కవులు అవ్వగలిగితే, పాల్కురికి సోమన కూడా ఆధునికుడే అవుతాడు. ఐతే ఒక శతాబ్దం కింద ఆధునిక కవి అయినవాడు కొన్ని శతాబ్దాల తర్వాత కూడా ఆధునిక కవి అనబడతాడా ? అరవై ఏళ్ళ వయస్సున్న బాల సుబ్రహ్మణ్యాన్ని అరవై య్యవ ఏట కూడా బాలుడంటామా ?

కుందుర్తి :

మార్పు అనుక్షణం జరిగేదే. మనం సాహిత్యంలో ఏర్పాటు చేసుకున్న "యుగాలు" అనేవి బాగా కనిపించే కొన్ని లక్షణాలను బట్టి ఏర్పాటు చేసు

కున్నవే ఛందోబద్ధ కవిత్వం, ప్రజా కవిత్వం దిశగా వెళ్ళాలని చాలాసార్లు ప్రయత్నించింది. అందులో సోమన, వేమన మొదలైన వారున్నారు. సోమన నాటికి మత ప్రచార స్పృహే ఎక్కువగా వుంది. వేమనది సామాజిక స్పృహ.

డా. దాశరథి :

ఏ నాటికి ఆ నాడే ఆధునికత—సోమన ఆనాడు ఆధునికుడే.

ఆరుద్ర :

ఉన్న పద్ధతిని విడిచిపెట్టవలసిన అవసరం వస్తే తప్పక విడిచివేయాలి. మార్గ ఛందస్సుల్ని విడిచిపెట్టి గురజాడ అప్పారావు మాత్రా ఛందస్సు చేతబట్టటంతో తెలుగు కవిత్వపు రూపం మారిపోయింది. వెంకటపార్వతీశ కవులు ద్విపదలు, భావ కవులు తేటగీతలు చేపట్టటం కాలానుగుణ్యంగా అవసర మయ్యింది. తన కాలానికేది అవసరమో గుర్తించ లేనివాడు మంచి కవి కాడు.

డా. వేదుల :

పాల్కురికి సోమన నాటి భావములు అతని కాలమునాటి భావములతో ఆధునిక లక్షణం పొందియే యున్నవి. అతడానాడు ఆధునిక కవియే అని పించుకున్నాడు. అతడు ద్విపద వ్రాసినను అది ప్రాచీన కవితా ఛందస్సు లోనిదే. భావములు, భాష మాత్రము నిత్య నూత్నతకు సంబంధించినవి. కాన ఆనాటి వారి కతడు ఆధునిక కవియే.

(F) ఆధునికత అన్నది ప్రక్రియను అనుసరించా? వస్తువుని అనుసరించా?

డా. దాశరథి :

ప్రక్రియ—వస్తువు—రెండు.

కుందుర్తి :

ఆధునికత అనేది ప్రధానంగా కవితా గుణసంబంధి. వస్తువును అనుస రించే వుంటుంది. దానికి అనుగుణంగా ప్రక్రియలో కూడా ప్రవేశిస్తుంది.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఆధునికత ప్రధానంగా వస్తువుని అనుసరించే ప్రక్రియ ఏదైనా కావ్య ధర్మ భంజకం కాదు కనుక ఆధునికత వస్తుగత లక్షణం మాత్రమే. కావ్య

ధర్మ గతంగా అలంకారాలు, ప్రాచీన కావ్యాల్లో ప్రయోగింపబడి యీనాటి ఆధునిక కవితలో బింబాలు, ప్రతీకలుగా వాడుతున్నప్పటికీ ఈ భిన్నంగా కని పించే కావ్య ద్రవ్యాల్లో ఆంతరికంగా ఏకత వుండటం చేత వాటినిబట్టి ప్రాచీన, ఆధునిక భేదాన్ని నిరూపించ బూనటం అంత గట్టి పని కాదేమో!

శ్రీ శ్రీ :

ప్రక్రియ, వస్తువు—రెండూ కలిస్తేనే కవిత్వం. ప్రక్రియ శరీరం, వస్తువు ప్రాణం. ఒకటి లేకుంటే రెండోది కూడా లేదు ఇది ఆధునికతకు మాత్రమే కాక అన్ని కాలాల కవిత్వానికి అన్వయిస్తుంది.

డా. దివాకర్ల వేంకటావధాని :

ఆధునికత్వము ప్రక్రియపై కంటె వస్తువుమీద, భావములమీద రచనా విధానము మీద ఆధారపడి ఉండును.

డా. సి. నారాయణరెడ్డి :

రెంటి ననుసరించీ

ఆరుద్ర :

వస్తువుని బట్టి ప్రక్రియ కూడా మారుతుంది. ప్రాచీనులు కూడా రసాన్ని బట్టి వస్తువునుబట్టి, వృత్తాల్ని కూడా ఎంచుకునే వారు. లయగ్రాహిలో వసంత వర్ణన, వనవిహారం, పుష్పాపచయం—రగడల్లోను, యుద్ధాన్ని మహాస్రగ్ధరల్లోను రచించడానికి ఇదే కారణం. నేటి కావ్య వస్తువుసు వచన కవిత్వంలో చెబితేనే ఔచిత్యం వుంటుంది.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

ఆధునికత అనునది వస్తువును అనుసరించి.

(2) ఆధునిక కవిత్వంలో – కవికి సామాజిక స్పృహ, కట్టుబాటు అంటే ఒక కమిట్‌మెంట్ లాంటిది వుంటే తప్ప అది కవిత్వంకాదు— అన్న ధోరణిని మీరెంతవరకు సమర్థిస్తారు?

డా. సి. నారాయణరెడ్డి :

కవిత్వానికి కావలసిన మూల ధాతువులుంటూ సామాజిక స్పృహ ఉంటే అది ఉభయతారకం. వీటికి తోడుగా కవి తాను విశ్వసించిన సాంఘిక ప్రయోజ నాలపట్ల 'నిబద్ధత' కలిగి ఉంటే మరీ మంచిది.

డా. దివాకర్ల వేంకటావధాని :

సామాజిక స్పృహ ఉండవలసినదే. సాహిత్యమునకును, సంఘము నకును చాల సన్నిహిత సంబంధము ఉండును. కాని సామాజిక స్పృహ ఉన్నదే కవిత్వము లేనిది కవిత్వము కాదు అను భావము సరియైనది కాదు. కవిత్వ నామము సార్థకము చేయుటకు రస, ధ్వని, చమత్కారాది లక్షణము లుండి తీరవలయును. వానితో బాటు సామాజిక స్పృహ కూడ ఉన్నచో బంగారమునకు తావి అబ్బినట్లుండును.

శ్రీ శ్రీ :

పూర్తిగా సమర్థిస్తాను. కవికి సమాజంపట్ల ఒక బాధ్యతవుంది. దాన్ని విస్మరించటం అంటే సమాజానికే ద్రోహం. వెనుకటి కవులు నిరంకుశులేమో కానీ నేటి కవులు (నిజమైన కవులు) సమాజ శ్రేయస్సుకి నిబద్ధులు.

గుంటూరు శేషేంద్రశర్మ :

కవికి కమిట్ మెంట్ కావాలి అన్నంత వరకు నా దృష్టిలో నిర్వివాద మైన విషయం. ఐతే ఆ కమిట్ మెంట్ ఏమిటి ? అన్న విషయంలో సంకుచిత మైన నిర్వచనం నుంచి సారవంతమైన నిర్వచనం వరకు లక్ష సమాధానా లున్నాయి. కవి అనుభూతి పూర్వకంగా, త్రికరణశుద్ధిగా, భావోద్రేకాత్మకంగా జీవితంలో నిమగ్నుడు కావటం ఏదైతే వుందో అది కవిత్వ జన్మకే జీవ హేతువు. క్లుప్తంగా చెబితే కవి ఫీలింగ్ తో బతకటం నేర్చుకోవాలి. లేకపోతే కవిత్వం పుట్టదు. Feling పుట్టటానికి మూలద్రవంనీతి. ఈ సత్యం మన ఆలోచనలని ఎంత లోతులకు తీసుకుపోతుందో ఆలోచించే తెలుసుకోవాలి.

కుందుర్తి :

కవిత్వంలో కమిట్ మెంట్ అంటే యీ రోజుల్లో చాలామంది సంప్రదాయ సాహితీ వేత్తలూ, మరికొందరు యితరులు అనుకుంటున్నంత భయంకరమైన విషయమేమీ కాదు. నేననుకుంటాను వాల్మీకి నుండి నేటి వరకు కమిట్ మెంట్ లేని కవి లేడేమోనని. పూర్వకవులందరూ భగవంతుడు, పాప పుణ్యాలు, పునర్జన్మలు మొదలగు మత విశ్వాసాలకు కమిట్ అయినవారే. తమ యుగంలో ప్రవర్తిల్లిన ఆలోచనా స్రవంతిలో యీదులాడినవారే. ఈ యుగంలో యుగ ధర్మం అని నేను విశ్వసిస్తున్నది, సోషలిస్టు సమాజ వ్యవస్థకోసం తపన

పడటం, దీనికి మార్గం మార్క్సిజం. అందువల్ల కమిట్‌మెంట్ వుంటే తప్ప నిజమైన కవిత్వం బైటకి రాదు.

డా. దాశరథి :

సామాజిక స్పృహలేని కవిత్వం ఉండదు. కమిట్‌మెంట్ ఎప్పుడూ వుంది. నన్నయ కమిట్‌మెంట్ వైదికవ్యాయిత.

ఆరుద్ర :

కవికి తప్పకుండా కమిట్‌మెంట్ వుండాలి. సమాజాన్ని, దాని వెనుక స్వభావాన్ని సక్రమంగా అర్థం చేసుకుంటే కమిట్‌మెంట్ దానంతటదే రచయితలో సిద్ధిస్తుంది.

మహీధర రామమోహనరావు :

కవికి సామాజిక స్పృహ, నిబద్ధత వుండాలంటున్నాం. నిజమే. అయితే ఈ పదాలను ఒక ప్రత్యేకఅర్థంలోనే వాడుతున్నాం. రచనా ప్రక్రియలు ఈనాడే ప్రారంభంకాలేదు. మనకు బోలెడు సాహిత్యంవుంది. మహనీయులైన సాహిత్యకారులూవున్నారు. వారికి సామాజిక స్పృహ, నిబద్ధత లేవంటే నేను నమ్మను. ఆనాటి సమాజము వేరు. సమాజసంబంధాలు భిన్నం. అందుచేత వారి సామాజిక స్పృహ, నిబద్ధతల స్వభావంవేరు. అయితే ఈ భిన్న భిన్న స్వభావాలుగల నిబద్ధత, సామాజిక స్పృహల కాలాలమధ్య సరిహద్దులు గీసివుండవు. పైన చెప్పినట్లు ఇవి కూడా పరావరణ ప్రవేశం చేయడం తరచు చూస్తూనే వున్నాం. అంతేకాదు. మనం నేడు చెప్తున్న అర్థంతోనే సామాజిక స్పృహ, నిబద్ధతలు బహు ఛాయా భేదాలతో వుండడం చూస్తున్నాం. అవీ అఖండ మూర్తులుగా లేవు.

మరొకటి - సామాజిక స్పృహ, నిబద్ధత కవికి వుండాలనడంతో మనం సమాజ పరిణామాలను గురించిన అవగాహన విధిగా వుండాలని నిర్దేశిస్తున్నామన్నమాట. అది నేటి సమాజంలో కవుల కర్తవ్యాన్ని నిర్దేశిస్తుందేమోగాని ఆదనపు కవిత్వ లక్షణాన్ని నిర్దేశించడంలేదు. రచనలో కవికిగల సామాజిక స్పృహ, నిబద్ధత ప్రవేశిస్తాయి. ప్రతిబింబిస్తాయి. తనకున్న స్పృహ, స్వభావం కవికి తెలియకపోయినా అది జరుగుతుంది. కనక మనం చెప్పే సామాజిక స్పృహ ఏమిటో, నిబద్ధత అంటే ఏమిటో మనకే ఒక స్పష్టమయిన అవగాహన అవసరం.

సమాజం పరిణామ శీలం. ఆ పరిణామ క్రమంలో, ప్రతి ఘట్టంలోనూ తన ఉనికికీ పురోగతికి అవసరమయిన నిబంధనలను అది మార్చుకుంటుంది. ప్రతి దానికీ వలెనే దానిలోనూ ద్వివిధాత్వం వుంటుంది. ప్రతి దశలోనూ సమాజం కూర్చుకున్న నియమ నిబంధనలు భవిష్యత్తులో నిరుపయోగములు, అనవసరములు, పురోగతికి ఆటంక కరములు అవుతాయి. అయితే యీ పురోగతి గత దశలలో ఏర్పరచుకున్న నియమ నిబంధనల మీదనే ఏర్పడిందనే విషయం విస్మరించకూడదు మరల మనం ఈనాడు పురోగమన శీలం అనుకున్నవి మున్ముందు మారవలసి వస్తుందనేది కూడా మరవకూడదు. ప్రతి ఒక్కటీ పరిణామ శీలం. ప్రతి పరిణామదశా అంతక్రితపు దశలోంచి పుట్టింది. తరువాతి దశకు జన్మనిస్తుంది.

ఇది ఆర్థిక, రాజకీయ, సామాజిక సంస్కృతీ రంగాలన్నిటికీ వర్తిస్తుంది. అనే అవగాహనా, ఈ ప్రపంచ దృక్పథమూ, కవికీ, రచయితకీ వుండాలంటున్నాం. దీనినే సామాజిక స్పృహ అంటున్నాం.

ఇంక నిబద్ధత గురించి—ఏదో ధ్వంసం చేయడమో, ఎవరినో చంపడమో గురించికాదు మన నిబద్ధతలు అవి ఆనుషంగికాలు. ప్రధాన విషయం సమాజ పురోగతికి తోడ్పడటం. అందుకై జనాన్ని ప్రబోధించడం, దారి చూపడం, ముందునిలిచి నాయకత్వం వహించడం, ఆటంకాల నధిగమించేందుకు పోరాడడం, అందుకూ మన నిబద్ధత.

డా. వేదుల సూర్యనారాయణశర్మ:

ఆ ధోరణి సమర్థనీయము కాదు.

2 A) మీరు రాసేటప్పుడు మీ కమిట్---- ~~~~ .
మీ కవిత్వ సిద్ధాంతం ఏమిటి?

ఆరుద్ర:

నాది సామ్యవాద దృక్పథం. విశ్వనాథవారిది సనాతనం అని అందరికీ తెలుసు. ఆయన సిద్ధాంతంతోనే గానీ ఆయనతో నాకెప్పుడూ పేచీలేదు. అయితే ఒకప్పుడు మనిషికీ సిద్ధాంతానికి తేడా వుండదు. అపుడు యిద్దరితోటీ పేచీ పడాలి. తన వర్గానికి ప్రతినిధిగా దానికి బాకాగా, ఏ రకమైన కమిట్‌మెంట్ వున్నవాడైనా పరిణమించక తప్పదు.

శ్రీ శ్రీ :

సమాజంలోని సమస్యలను, సంఘర్షణలను మార్క్సిస్ట్ దృక్పథంతో అవగాహన చేసుకోవటం. తల్లి వేరులాగ యీ అవగాహన కవిత్వానికి పరిపుష్టి నిస్తుంది. నేను కవిత్వం రాసేటప్పుడు ఇదేనా నిబద్ధత-ఇదే నా సిద్ధాంతం.

డా. దాశరథి :

నా కమిట్‌మెంట్ రాజకీయాలకు అతీతమైన సర్వ మానవ సౌభ్రాత్రం. నా కవిత్వ సిద్ధాంతం దమన నీతిని-అది ఏ రూపంలో ఉన్నా-ఎదిరించటం; కవిత్వానికి ప్రయోజనం ఉందని నిరూపించడం; కళామూల్యాలను వదలుకోక పోవడం.

గుంటూరు శేషేంద్రశర్మ :

నేను జీవితంలో ఫీలై (Feel) పొందిన అనుభూతిని ఒక అమూల్యమైన సంపదగా ఆర్జించు కుంటాను, అదే కవిత్వానికి మూల ద్రవ్యం కనుక. నేను జీవిత అనుభూతిలో ఫీలై గాయపడి ఒక మాట చెబుతాను. అలాంటి సన్ని వేశాల భిన్నతను బట్టి నా అనుభూతికూడా భిన్నంగా వుంటుంది. తత్కారణంగా నా మాటలు వినబడే స్వరం కూడా భిన్నంగా వుంటుంది. ఒకప్పుడు ఆ స్వరం క్రోధారుణంగా ఉండవచ్చు. మరొకప్పుడు ప్రేమార్ద్రంగా ఉండవచ్చు. నా 'శేష జ్యోత్స్న', 'మండే సూర్యుడు' కావ్య సంపుటాల్లో ప్రేమార్ద్ర స్వరం ప్రధానంగా కనిపిస్తుంది. అన్య ఉపస్వరాలు లేకపోలేదు. నా 'నీరై పారి పోయింది. కావ్యంలో ఒక సౌందర్య రస తపస్సు కనిపిస్తుంది. 'నా దేశం-నా ప్రజలు', 'గొరిల్లా' లలో అధర్మ విద్వేషం, క్రోధ విజృంభణ కనిపిస్తాయి. వీటన్నింటికీ ఒక ఏకైక సిద్ధాంతం ఉండాలనుకోవటం కావ్య మర్మజ్ఞత కాదు. కావ్యానికి అనుభూతి ప్రధానం కానీ సిద్ధాంతం కాదు. ఈ విషయం కోసం ఆర్చిబాల్డ్ మెక్లేన్ రాసిన 'Poetry and Experience' అనే గ్రంథంకానీ, జొనర్జిన్ రాసిన 'Fundamentals of Marxists', 'Easthatics గానీ చదవటం చాలా అభిలషణీయం.

కుందుర్తి :

స్థూలంగా మార్క్సిస్టు సిద్ధాంతానికి నా కమిట్‌మెంట్. అదే నా కవిత్వ సిద్ధాంతం కూడా.

డా. దివాకర్ల వేంకటావధాని :

కవిత్వ ప్రధాన ప్రయోజనము సద్యః పర నివృతి-మిగిలినవి ఆనుషంగికము. ఆనంద ప్రధానశక్తి ఏ లక్షణములపై నుండునో ఆ లక్షణములను దృష్టి యందుంచుకొని కవిత్వము వ్రాయవలెను. అదే నా సిద్ధాంతము.

డా. సి. నారాయణరెడ్డి :

నేను రాసే కవిత్వం అనుభూతినుంచీ, ఆవేశంనుంచీ సాంఘిక న్యాయాన్నను పరించీ పుడుతుంది. అందులోనేవుంది నా నిబద్ధత.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

మా కవిత్వ సిద్ధాంతము ఉన్నతోన్నతమగు భావ చైతన్యమును కలిగించుటయే.

(B) కమిట్‌మెంట్ అనే కళ్లద్దాల్లోంచి చూస్తే కవికి నిసర్గ సౌందర్యం కనిపించకపోగా లేనిరంగు కనిపించే ప్రమాదం — దాంతో అదే నిజమనే సిద్ధాంతం-వస్తుందంటారు. కాబట్టి కవికి కమిట్‌మెంట్ అవసరం లేదంటే మీ రొప్పుకుంటారా ?

డా. సి. నారాయణరెడ్డి :

ప్రశ్నలోని కళ్లద్దాల రూపకం అస్పష్టతకు దారి తీస్తున్నది. ఇంతకూ అవి ఏ రంగు కళ్లద్దాలు? తెల్ల కళ్ళజోడులోంచి చూస్తే లోకమంతా ఉన్న రంగులోనే కనిపిస్తుంది. రంగు కళ్ళజోడు నుంచి చూస్తే కనిపించేది లోకం అసలు రంగుకాదు. ఆ కళ్ళజోడు చల్లని రంగు.

డా. దివాకర్ల :

కమిట్ మెంట్ లేకుండా నున్నప్పుడే నిసర్గమైన కవితా సౌందర్యము కనుపించును. కవికి ఎంత స్వాతంత్ర్య మున్నచో అంత మంచిది. అతడు కమిట్‌మెంట్ దృష్టిలో నుంచుకొని కవిత్వము వ్రాసినచో కొంత కృత్రిమత్వము కలుగును. ధూర్జటి వ్రాసిన శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము, శ్రీ కాళహస్తీశ్వర శతకము పోల్చి చూచినచో ఈ విషయము తేట తెల్లమగును. మొదటిది కట్టుబాటుతో కూడినది. రెండవ దతడు స్వతంత్ర భావములతో వ్రాసినది తెలుగు శతకములలో ఇట్టి స్వాతంత్ర్యము హెచ్చుగా కనిపించును.

కుందుర్తి :

నిసర్గ సౌందర్యం అనేది నా కెప్పుడూ కనిపించలేదు. సత్యం, సౌందర్యం అనేవి Absolute గా వుండవు. కాలానికి వాటిని కూడా తన కాళ్ళ దగ్గర కట్టివేసుకునే శక్తివుంది. అవి మారవని చెప్పిన భావన ఫ్యూడల్ వ్యవస్థలోనుండి పుట్టిన భావన.

కమిట్ మెంట్ అవసరం లేదనుకోవడం నేలవిడిచి సాముచేయడం.

ఆరుద్ర :

కమిట్ మెంట్ ఎప్పుడూ కళ్ళకి గంతల్లా పనిచేయదు. సామాజిక స్పృహ, కట్టుబాటు బైనాక్యులస్ వంటివి. దూరాన వున్న దృశ్యాలు కూడా వాటివల్ల చాలా సమీపాన ఉన్నట్టు కనపడతాయి. కవికి ఒక ప్రత్యేకమైన సిద్ధాంతం ఉండాలి.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఈ ప్రశ్న భారమంతా కమిట్ మెంట్ అనే పదంమీద పడుతుంది. దాన్ని గురించి చెప్పాను. అది ఇక్కడ అన్వయించుకుంటే సరిపోతుంది.

డా. దాశరథి :

రాజకీయ కమిట్ మెంట్ అవసరంలేదు.

శ్రీ శ్రీ :

ఇది చాలా అశాస్త్రీయమైన ధోరణి. శాస్త్రజ్ఞుడు టెలిస్కోపులో, మైక్రోస్కోపులో ఉపయోగిస్తాడు. యోగి కళ్లు మూసుకుని సత్యాన్ని సందర్శించానంటాడు. ఏది సత్యమో మీరే నిర్ణయించుకోండి.

మహీధర రామమోహనరావు :

నిసర్గ సౌందర్యం అంటే ఏమిటో నాకు అర్థం కాదు. ఏదీ నిరపేక్షం కాదు. సౌందర్యం అనేది చూసే వ్యక్తి యొక్క సంస్కారం పట్టి వుంటుంది. కవికి కనిపించే సౌందర్యం ఎప్పుడూ సంసర్గమే; నిసర్గం కాదు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

ఒప్పుకుంటాను.

(C) కమిట్‌మెంట్ అవసరం లేదంటే కవి ఎందుకు రాస్తున్నట్టు? ఆత్మానందం కోసమా? ఐతే ఎందుకు ముద్రించాలి.

డా. దాశరథి :

కవి ఎందుకు రాస్తున్నాడో తెలియకుండానే రాస్తాడు. తనకోసం, ప్రపంచం కోసం రాస్తాడు. తను స్పందించి, ఇతరులను స్పందింప చేస్తాడు.

శ్రీ శ్రీ :

ఆత్మానందంకోసం రాస్తున్నాననటం ఆత్మవంచన. అప్పుడు ముద్రణ ప్రసక్తేలేదు. తాను రాసింది పదిమంది చదవాలని ప్రతికవీ ఆశిస్తాడు. కవిత్వానికి సామాజిక ప్రయోజనం ఉందనుకుంటే, కవి తనకోసం కాక తనచుట్టూ ఉన్న ప్రజలకోసం కవిత్వం రాయాలి. అలాకాదు ఆత్మానందమే ధ్యేయమనుకుంటే దైవప్రార్థనలాగ ఒక మూల కూర్చొని, ముక్కు మూసుకుని ఆ ప్రార్థనేదో తనలోతానే సాగించుకోవచ్చు.

గుంటూరు శేషేంద్రశర్మ :

కమిట్‌మెంట్ పదానికి ఎక్కువమంది కావ్య మర్మ వివేకం లేనివాళ్లు ఊహించు కుంటున్న అర్థంచేత ఈ ప్రశ్న పుడుతుంది. కవి అన్న వాడెప్పుడూ రెండు భాగాల అనివార్య సంపుటి. ఒకటి అంతః ప్రపంచం, రెండు బహిః ప్రపంచం. ఇంగ్లీషులో Subjective, Objective అనేవే ఇవి. కవి ముందు వ్యక్తి గతంగా ఫీలవుతాడు. ఈ ఫీలింగ్‌కు మూలం బహిఃప్రపంచ సన్నివేశమే. ఈ రెంటి సన్నికర్షణ ఫలితంగా పుట్టిన భావాభివ్యక్తికి ఉన్న కళాత్మక లక్షణాలు కవియొక్క వ్యక్తిగతమైనవే. కనుక ఫీలింగు, అనుభూతి, అభివ్యక్తి ఈ మూడు Subjective. ఫీలింగుకు మూలకమైన అనుభవ సన్నివేశం Objective. కనుక కావ్య ప్రక్రియ కెప్పుడూ కవి, పాఠకుడు అనే రెండు పక్షాలూ అనివార్యమైనవి. ఇందులో ఆత్మానందమన్న కావ్య వివేక బహిర్గతమైన శబ్దం ఏ పాటి స్థానాన్ని పొందగలదో ఊహించుకోవలసిందే!

ఆరుద్ర :

నేటి వర్గ స్వభావాన్ని బట్టి కొందరు ఆత్మానందం కోసమే రాస్తున్నారని చెప్పటానికి వీల్లేదు: యశస్సు కోసం, డబ్బుకోసం, భుక్తికోసం రాస్తున్న వాళ్ళని మనం చూస్తూనే వున్నాం.

కుందుర్తి :

ఇది నేను నా ప్రసంగాలలో సౌందర్య వాదులను చాలాసార్లు అడిగిన ప్రశ్న. జవాబులేదు. ఎందుకు ముద్రిస్తున్నారంటే ప్రతివాడికీ తనవలె ఆలోచించే కొద్దిమంది అయినా ఉంటారు కదా—వారి కోసం అనుకుందాం.

డా. దివాకర్ల వేంకటావధాని :

నిజమునకు ఆనందము ననుభవించువారు పఠితలు. కవికి తన అభిప్రాయమును లోకమున కందించి, దానిని శ్రేయః పూర్ణము కావింపవలెనను అభిప్రాయముండును. అందుకై అతడు తన భావములను కవితామయముగా ప్రదర్శించును. ఆనందమునకు ఉపదేశము కూడ జతచేయుట మంచిదే. కాని ఉపదేశమే ప్రాధాన్యము వహించకూడదు. దానికి వేరు గ్రంథములు కలవు. కవి గ్రంథములను ముద్రించుట తన భావముల నందరు ఎఱుంగుటకే. దాని వలన పఠితలు ఆనందించినచో తృప్తినొందుటకు.

డా. సి. నారాయణరెడ్డి :

ఒక కవి తాను ఆత్మానందంకోసం రాశానని చెప్పుకున్నా అది ముద్రించటం అనుచితంకాదు. ఆ ఒక్కడి ఆనందం ఎందరో పాఠకులకు ఆనందం కలిగించేదిగా ఉంటే ఆపడ మెందుకు ?

మహీధర రామమోహనరావు :

ఆత్మానందంకోసం వ్రాస్తున్నా నన్నమాటను పరవంచనగా భావించ దలుచుకోకపోతే, ఆత్మవంచన అని భావించక తప్పదు. అసలు తన మనస్సులోని భావాన్ని కాగితం మీద పెట్టడంతో రచయితకు ఒక అహం, ఆత్మ వ్యక్తీకరణానందం-ఆత్మానందంకాదు-వుంది. అది లేనివాడు రాయడు, రాయలేడు. అందుచేత ఆత్మానందం కోసం వ్రాస్తున్నానన్నది వట్టి బుకాయింపే కావాలి; అవ్యక్తతయేనా కావాలి. ఏదయినా పట్టించుకో తగినదికాదు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

తన ఆనందమును ఇతరులకు అందజేయుట కవికి ఆత్మ తృప్తిని కలిగిస్తుంది. కనుకనే కావ్యాలను ముద్రిస్తాడు.

3. కాలానుగుణంగా ధనవంతులు, మధ్యతరగతివారు, పేదవారు అన్న తేడా లేకుండా దాదాపు అన్నిరకాలవారు ఒకేరకమైన కవిత్వం

రాస్తూండటం కనిపిస్తుంది.—అంటే—శ్రామిక, కార్మిక, పీడిత, తాడిత జన బాధల్ని గురించి అనుకోండి. అప్పుడు ఎక్కడో ఒక వర్గంలో అనుభవం లేక పోవటంవల్ల చిత్తశుద్ధి, స్పష్టత లోపించవచ్చు-అటువంటి పరిస్థితుల్లో కవిత్వాన్ని గుర్తించటానికి తగిన కొలమానాలేమిటి?

డా. సి. నారాయణరెడ్డి:

పీడిత వర్గాలను గురించి రాసే కవి ఆవర్గానికి చెందినవాడే కానక్కర లేదు. సానుభూతి ముఖ్యం. ఆవర్గ సమస్యల పట్ల సానుభూతితో పాటు సమగ్రమైన అవగాహన ఉండాలి. అందుకుతగ్గ బలమైన అభివ్యక్తి అవసరం.

కుందుర్తి:

నిజాయితీ, చిత్తశుద్ధి అనేవి ప్రజాదృష్టితో రాసే కవికి చాలా ముఖ్యం. ఇవి కవిత్వంలో వున్నాయా? లేవా? అని కనుక్కోడానికి ప్రమాణాలుగా నిర్దిష్టమైన సూత్రాలు నిర్మించడం అసాధ్యం. కవిలోని ఆవేశం బయటికి రావడంలో—అంటే—Expression లో ఇవి గర్భితంగా ఉంటాయి. వేమన, పోతన మొదలగు వారిలో ఇవి స్పష్టంగా కనిపిస్తాయి. ఇంగ్లీషుపద బంధంలో చెప్పినట్లు between the lines చదువుకోవటమే శరణ్యం. ధనవంతులు etc. ఏ వేదికనైనా ఆక్రమించుకుంటారు. తమ సంస్కృతిని దాచి పెట్టడానికి ప్రయత్నిస్తూ రాస్తారు. కాని దాని దుంపతెగ అది దాగదు. ఇప్పుడు అన్ని పార్టీల వారూ సోషలిజం మంత్రం వల్లించటం లేదూ! ఇదీ అంతే.

అయితే చిత్తశుద్ధి లేనివాడి రచనలో స్పష్టత లోపించవచ్చు అని ప్రశ్నలోనే ఉందికదా. దొంగను పట్టుకోడానికి ఇదీ ఒక మార్గమే అనుకుంటాను.

అయోమయమైన పదచిత్ర గుంభన చేసేవారిలో నిజాయితీ లోపించినవారూ వుంటారు. ప్రయోగవాదులూ, వైవిత్రివాదులూ ఉంటారు. ఇతర సాహిత్య ప్రక్రియల వలన ప్రభావితులైనవారూ ఉంటారు, రకరకాలు!

డా. దివాకర్ల వేంకటావధాని:

కవి ధనిక వాదమును నిరసించుచూ శ్రామిక, కార్మిక వర్గములపై సానుభూతి ప్రదర్శించుచూ కవిత్వము వ్రాసి తాను ధనిక వర్గమునకు చెందిన వానివలెనే వర్తించినచో చిత్తశుద్ధి లేనివాడే అగును. అపుడు స్పష్టత కూడ

లోపించును. కవిత్వము చదువుచుండగ ఈ లోపము కనిపించుచునే ఉండును. ఆ లోపమును మరుగుబుచ్చి కవి రచన సేయగలిగినచో మనమతని స్వభావమును గుర్తించుట కష్టమే అగును. అందుచే కవిజీవిత పరిస్థితులనుకూడా గమనించి అతని కవిత్వమును చదువుట మంచిది. అప్పుడాతని సహజభావములను గుర్తించుట కవకాశముండును. లేనిచో కవిత్వమును గుర్తించుట దుష్కరమే అగును.

ఆరుద్ర :

ఈదేశంలో అధిక సంఖ్యాకులు శ్రామికులు, పీడితులు. కాబట్టి బహుజన హితం, బహుజన సుఖం కోరుకునే రచయితలు ఆ వర్గం గురించే రాస్తున్నారు. ఇది సహజం. అయితే కేవలం చిలక పలుకులు కాక అనుభవంతో రాసింది సజీవంగా వుంటుంది ఊటీ కొండలమీద, యూకలిప్టస్ చెట్లక్రింద కూర్చొని కష్టజీవుల్ని గురించి రాసేవాళ్లే మనకున్నారు. ఇటువంటి కవితలు ప్రజలకు జీర్ణంకావు.

డా. దాశరథి :

"అనుభవం" అంటే కవి కూలిపని చేయనక్కరలేదు. కూలిపని చేసే వారి బాధలు తెలుసుకోగలిగితే చాలు కవి ద్రష్టకదా! పాఠకుని అనుభూతే కొలమానం.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఆలీబాబా 40 దొంగలు కథలో దొంగలు ఆలీబాబాను చంపాలనుకొని వాడున్న ఇంటి తలుపుమీద గుర్తుపెట్టి రాత్రి వద్దామని వెళ్ళిపోతారు. ఇది చూచిన ఆలీబాబా భార్య ఆ వీథిలో ఉన్న అన్ని ఇళ్ళ తలుపులమీద అదే గుర్తు పెట్టింది. ఫలితం దొంగలు ఆలీబాబా ఇంటిని గుర్తించలేక పోయారు. ఆవిధంగానే ఈనాడు అందరూ పీడిత, తాడిత శ్రామిక జనాన్ని గురించి కవిత్వమనే రచనలు చేస్తునే ఉన్నారు. ఆ పీడిత జనాన్నిగురించి రాసినంత మాత్రం చేతనే అది కవిత్వమనే దృఢ విశ్వాసం కూడా వహించారు. వీళ్ళలో ఎవడు కవో, ఎవడు కవికాడో గుర్తించడం అసాధ్యం అనిపిస్తుంది. తెలుగు కవిత్వం ఆలీబాబా కథగా మారింది. కానీ నిజమైన కావ్య మర్మజ్ఞుడు అసలు సరుకును నకిలీ సరుకునుంచి విడదీసి గుర్తించగలడు. ఒక కవిత చదువుతున్నప్పుడు లేక వింటున్నప్పుడు అది ఫీలింగ్ అనే మూల ద్రవ్యంలోంచి పుట్టినదైతే పాఠకుడు హృదయంలోకూడా ఫీలింగ్ అనే జ్వాలను అంటిస్తుంది.

ఈ మహాసత్యాన్నే ప్రాచీనులు రసము సహృదయ హృదయైక వేద్యమనే మాటతో చెప్పారు. ఈ ఫీలింగ్ కలిగించనిది అలంకారాలున్నా, శ్రామికజనుల మద్దత్తు ఉన్నా అకవిత్వమని స్పష్టమవుతుంది. కనక ఫీలింగు కలిగించే శక్తి కవిత్వానికి గీటురాయి.

శ్రీ శ్రీ :

ఇంతవరకు మనం అక్షరాస్యుల కవిత్వం గురించే ఆలోచిస్తున్నాం. నిరక్షరాస్యుల్లో కూడా ఎంతో కవిత్వం నిక్షిప్తమై ఉంటుందని మనం మర్చిపోకూడదు. అయితే వీళ్లు ఎప్పటికీ నిరక్షరాస్యులుగానే మిగిలిపోరు. ఇవాళ కాకపోతే రేపైనా నిరక్షరాస్యత నిర్మూలం కాక తప్పదు. అప్పుడు వెలువడే కవిత్వం ఎలా వుంటుంది? దాని కొలమానా లేవిటి? అని ఆలోచిస్తే కవిత్వానికి ఎన్ని నిర్వచనాలున్నాయో అన్ని సమాధానాలూ చెప్పుకోవలసి వస్తుంది. నా మటుక్కు నేను "రాతిరియున్ పవల్ మరపురాని హాయల్" అనే నిర్వచనాన్ని ఆమోదిస్తాను. చెళ్ళపిళ్ళ వారన్నట్లు" మరిచిపోయేదంతా చెత్త. జ్ఞాపకం ఉండేదే కవిత్వం."

మహీధర రామమోహనరావు :

రచనలలో మనం చూడగలది ఉయనకుగల మానవతా దృక్పథాన్ని. దయా దాక్షిణ్యాలు, ద్వేష కార్పణ్యాలూ కావు ధనిక, మధ్య, పేద భేదాలు, వర్గాల స్వభావం అన్నది వేరు. ఆ స్వభావం ప్రపంచాన్నీ సమస్యల్నీ అవగాహన చేసుకోవడంలో కనిపిస్తుంది. అవగాహనా లోపాన్ని, భేదాన్ని చిత్తశుద్ధి లోపంగా భావించడం తప్పు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

అట్టి పరిస్థితులలో కవిత్వాన్ని ఆ కాలంలో గుర్తించడం జరగదు. తరువాతి కాలంలో కవి మనస్సులాగే ప్రజామనస్సు కూడ దిగజారిపోతే ఆ కవిత్వం గుర్తింపబడితే గుర్తింపబడనూవచ్చు. దానికి కొలత అంటూ ఉండదు.

నార్ల వెంకటేశ్వరరావు :

పోతన ఆస్తికుడు కాగా నేను నాస్తికుడను. ఐనా పోతన కవిత్వంపట్ల నాకు గౌరవం వున్నది. అందుకు కారణం అది చిత్తశుద్ధితో కూడింది కనుకనే,

(4)

ఆ చిత్తశుద్ధి కారణంగానే ఆయన కవితకు జవం, జీవం వచ్చాయి. నాకు తెలుసు - నాకు తెలిసినవారిలో కొందరున్నారు - వారు నమ్మేదొకటి, వ్రాసేది వేరొకటి. వారి బ్రతుకొకటికాగా వారి సాహిత్యం మరొకటి. అట్టి రచనలు తాత్కాలికంగా ఒక వేళ రాణించినా, అవి ఎంతో కాలం నిలుస్తాయని నేననుకోను.

మీరు ధ్వనించినట్లు దళిత-పీడిత వర్గాల్ని గురించి కవితలు విశేషంగా వెలువడుతున్నవి. ఇట్టి రచనలు పెక్కింటిలో చిత్తశుద్ధి దాదాపు పూజ్యం. సోషలిజం, సెక్యులరిజం ఈనాడు ఫేషనైనట్టు కార్మిక, శ్రామిక వర్గాల్ని గురించి కన్నీరు కార్చటంకూడా ఫేషనై పోయింది. వీరికి నేటి సమస్య స్వరూపమైనా సరిగా అర్థమైనట్టు తోచదు. తాము సోంబేరులు కనక కార్మిక, కర్షకులు చమటోడ్చి పనిచేస్తున్నందుకు విలవిల్లాడుతున్నట్టు వీరు రాస్తారు. నిజానికి ఏనాడు కష్టించి పనిచెయ్యకపోతే ఆనాడు ఆ వర్గాలవారికి నోటి అన్నమైనా రుచించదు. వారి బాధ తాము కష్టించి పనిచేస్తున్నామనికాదు, — తమ కష్టం ఫలితాన్ని తాము పూర్తిగా పొందలేక పోతున్నామని మాత్రమే. ఇంక కొలమానా లేమిటి ?

4. తన అనుభవంలోలేని విషయాలు చెపితే కవికి కేవలం తన అభిరుచిని మాత్రం ప్రతిబింబించే ఒక రకమైన అసంపూర్ణ ధోరణి వచ్చే అవకాశంవుంది — మరి కవిత్వాన్నిబట్టి కవినా ? కవినిబట్టి కవిత్వాన్ని కొలవటం ?

గుంటూరు శేషేంద్రశర్మ :

నిజమే. కవిత్వాన్నిబట్టే కవిని కొలవాలి. కారణం లోకానికి కవిత్వం తోనే సంబంధం కనక. నిలిచేదో, చచ్చేదో కవిత్వమే కనక. నిలిచినపుడు కవి కనక. ఎప్పుడూ చేతిలో ఉన్న పుస్తకాన్ని ఆధారం చేసుకునే కావ్య విమర్శ జరగాలి. కవి విమర్శ లోకానికి కేవలం అప్రస్తుతం. అనవసరం.

శ్రీ శ్రీ :

కనిపించని బ్రహ్మ పదార్థంకాదు కవిత్వం. కవి లేకపోతే కవిత్వంలేదు. అందుచేత కవినిబట్టే కవిత్వం.

డా. దాశరథి :

అనుభవంలో లేని విషయం అంటూ ఉండదు. అనుభూతి ముఖ్యం. కవిత్వాన్నిబట్టే కవిని కొలవాలి

ఆరుద్ర :

నిజమైన కవి తనకు తెలియనివాటిజోలికి పోడు.

డా. దివాకర్ల వేంకటావధాని :

కవిత్వమును బట్టియే కవి హృదయమును గుర్తింపవలయును. కాని కవి లోపలనొకటి భావించి మరియొకటి వ్యక్తము చేసినచో వంచకుడగును. కవిత్వము కవి హృదయమునకు అనగా భావములకు ప్రతిబింబముగా నుండవలయును.

కుందుర్తి :

కవి పూర్తిగా తన అనుభవం మీదనే ఆధారపడి ఉండును. లోకానుభూతులను విని, చూసి, చదివి, నేర్చుకొని వాటిని ముందు తనవిగా చేసుకొని వాటిని సాధారణీకరించి దేశంమీద వదుల్తాడు. వ్యక్త్యనుభూతిమీద ఆధారపడిన దేదైనా అసంపూర్ణమే. కవినిబట్టి కవిత్వాన్ని కొలవాలంటే కవి ఎప్పుడూ అందుబాటులో ఉండడుకదా. కాలం గడచినకొలది అతనిని గురించిన అనేక విషయాలు మరుగున పడిపోవచ్చు. కాబట్టి ఎప్పటికైనా కవిత్వాన్నిబట్టే కవిని కొలవాలి.

డా. సి. నారాయణరెడ్డి :

పనితనాన్నిబట్టే పనివాణ్ణి, కవిత్వాన్నిబట్టే కవిని పరిగణించాలి.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

కవిత్వాన్నిబట్టే కవిని కొలవడం.

4. (A) కాలానుగుణంగా కవిత్వమా ?
కవిత్వానుగుణంగా కాలమా ?

డా. దాశరథి :

...........కాలానుగుణంగా కవిత్వం.

కుందుర్తి :

కాలానుగుణంగా కవిత్వం మారుతుంది.

ఆరుద్ర :

కాలాన్నిబట్టి కవిత్వం మారుతుంది. ఒక్క కాలాన్నిబట్టే కాదు, తిరుపతి కవులు చెప్పినట్టు "కాలముబట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి" దేశ భాషా లలితాంగి మారుతుంది. యెమర్జన్సీలో ప్రభుత్వాన్ని గాంచేకదా ఒక మహావిప్లవ రచయిత యెమర్జన్సీ సమర్థింపు రచనలు చేశాడు. నమ్మకంతో చేసిన రచనలే రాణిస్తాయి. అవకాశవాదం అఘోరిస్తుంది.

శ్రీ శ్రీ :

కాలంకన్నా ముందుగా పరుగెత్తేదే కవిత్వం.

గుంటూరు శేషేంద్రశర్మ :

అనుభూతి అనివార్య కావ్య జన్మహేతువు కనుక కవి కాలానికి శిశువు. వాస్తవాల కోరల్లో ఇరుక్కున్న ప్రాణి. కానీ కవి ఆ బాధల్లోనుంచి జనించే ఒక కాంతిజ్వాల. కనక కవి వాస్తవాల అవాస్తవాల దాంపత్యం. కవి గుండె అయిన అలంకారం అందుచేతనే ప్రత్యక్ష పరోక్ష ఐక్యం. కవిత్వం నశ్వర శాశ్వత వస్తు మిథున జన్యం. కవితలో ఉన్న జ్వాలీన, అవాస్తవ, పరోక్ష లక్షణ ప్రధాన అంశ ఏదైతే ఉన్నదో దానిచేత కవిత్వం కవికాలాన్ని అధిగమించి ఇంకా ముందు కాలాలవరకు ప్రయాణం చేస్తుంది. ఆ కాలాల ప్రజలమీద పనిచేస్తుంది. కనక కవి కాలశిశువు. కాలం కవిశిశువు. అనే విచిత్ర తాత్త్విక స్థితి మాత్రమే సత్యం.

డా. సి. నారాయణరెడ్డి :

కాలాన్నిబట్టే కవిత్వం. అయితే ఏ కాలం ? ముందు చూపు కోల్పోని కాలం.

డా. దివాకర్ల వేంకటావధాని :

కాలానుగుణముగనే కవిత్వము ఉండవలయును. కవిత్వానుగుణముగా కాలము మారుటకు అలౌకికమైన ప్రతిభ కావలయును. అట్టి ప్రతిభావంతులు అరుదుగా నుందురు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

కవి క్రాంతదర్శి కాన అతడు కాలాతీతుడు. స్వకాలంలోని లోపములకు దర్పణం పట్టి చూపించి, రావలసిన మార్పులను క్రాంత దర్శిత్వముతో కవి రచనచేస్తాడు అంతే. కాన, కవి కాలనిర్మాత అనియే చెప్పనగును.

5 కవిత్వం జీవితానికి వ్యాఖ్యానంగా వుండాలంటారు కదా ! మీరు ఏకీభవిస్తారా ?

మామూలుగా జీవితపరిధిలోకి రాకుండా వ్యక్తి అనుభవించే వివిధ ఆనందాల మాటేమిటి ? అవి మాటల కందవుగదా ! అప్పుడు కవిత్వం అసంపూర్ణ కళ అనవచ్చా ! అలాకాక – ఆనందం కూడా జీవితంలో భాగమే అనుకుంటే రాక్షసానందం (హింసాత్మకమైన ఆనందం) మాటేమిటి ? అదికూడా జీవితంలో ఒక భాగమని ఒప్పు కుంటే–దాన్ని వర్ణించటంకూడా వాస్తవ చిత్రణే ఔతుందా? అప్పుడు– జీవితంలోని అసౌందర్యాన్ని వర్ణించటం ఔచిత్యం కావచ్చుగదా. కాబట్టి అసౌందర్యంకూడా కవిత్వంలో భాగమని ఒప్పుకుంటారా? అలా ఒప్పుకుంటే ఔచిత్యానికి మీరిచ్చే నిర్వచనం ఏమిటి ? దిగంబర కవితా ప్రక్రియమీద మీ మాట ఏమిటి ?

డా. దాశరథి :

ఐతే రాక్షసానందం అనేది నిజమైన ఆనందం కాదు. ఆనందాభాస. దీని వర్ణన అనౌచిత్యమే అవుతుంది.

ఆనందం జీవితంలో భాగమే. దిగంబరకవులు జుగుప్సను ఆశ్రయించారు. చమత్కారంతో పాఠకులను ఆకర్షించారు. అవ్వాయిచువ్వలాగ ఎగిరారు. ఆరిపోయారు. నగ్నత్వం కొంత ఆకర్షిస్తుంది. తర్వాత మొఖం మొత్తుతుంది. అయినా తెలుగు దిగంబర కవులలో ఒరిజినాలిటీ లేదు. పాశ్చాత్య దేశాల్లో Naked poetry ఏనాడో వుంది. దాని అనుకరణ ఇది.

డా. సి. నారాయణరెడ్డి :

కవిత్వాదర్శం జీవితాన్ని వ్యాఖ్యానించటంతోనే పూర్తికాదు. దాన్ని సరైనరీతిలో మలిచేదిగా ఉండాలి. ఇక ఆనందం సంగతి-ఇది రెండు రకాలు. ఒకటి, తనకు సంబంధించింది. రెండోది సమస్తజనానికి సంబంధించింది. ఈ రెంటికి తేడా 'ఆత్మశాంతి' కీ 'విశ్వశాంతి' కీ మధ్య ఉన్నంతగా. ఇక అసౌందర్యంమాట. అసౌందర్యాన్ని వర్ణించటం అనౌచిత్యంకాదు. ఔచిత్యం వస్తువుని బట్టికాదు. వర్ణించే పాళ్ళనుబట్టి ఉంటుంది. ప్రమిదలో ఉంటూనే దీపజ్యోతి గదినంతటినీ వెలిగిస్తుంది. కవిత్వంలో ఔచిత్యానికి నేనిచ్చే ఉదాహరణమిది.

ఆరుద్ర :

కవిత్వం బహూకార్థ సాధకమైంది. ఎఱుకని సమగ్రం చేయటంకూడా దాని లక్షణాల్లో ఒకటి. ఏ రచన దానంతటది సూటిగా జీవితాన్ని వ్యాఖ్యానం చెయ్యదు. ఆ రచనసాయంతో వ్యాఖ్యానించు కోవాల్సింది పాఠకుడే. జీవితంలో ఏ ఒక్కటీ కవితకి అనర్హంకాదు. బీభత్సంకూడా ఒక రసమేకదా ! దీనిస్థాయీ భావం జుగుప్స. ఏవగించుకో వలసినదాన్ని కూడా తగినపద్ధతిలో చెప్పి ఒప్పించవచ్చు. తిక్కన్నగారొకసారి రణభూమిని వర్ణిస్తూ అది 'ఉగ్రసుందరం' అన్నారు. కడుపు దహించుకుపోయే పడుపుకత్తె రాక్షస రతినికూడా కవిగా అవసరమైతే పేర్కొనక తప్పదు. ఆలంకారికులందరిలోనూ క్షేమేంద్రుడికే నేను పెద్ద పీట వేస్తాను ఔచిత్యం ముఖ్యం అన్నందుకు. చదరపు వివరంలో చదరపుదిమ్మ అతికినట్టు ఇమిడితే అది నప్పుతుంది. విలువలు క్షీణిస్తున్న ఈనాటి సంఘంమీద జుగుప్స, ద్వేషం, కలిగించాలంటే దిగంబర కవుల ప్రక్రియ బలమైన ఆయుధం.

శ్రీశ్రీ :

కవిత్వం జీవితానికి వ్యాఖ్యానమేకాదు, సమస్యలకి పరిష్కారంకూడా. అసౌందర్యంకూడా ఒక వాస్తవమే. కొందరు సౌందర్యారాధకులు ఈ అసౌందర్యం లేనట్టు భ్రమించటమో లేదా దానినుంచి పలాయనం కావటానికి ప్రయత్నించటమో సాగిస్తారు. Caliban అద్దంలో తన ముఖం చూసుకుంటే కనిపించేది అసౌందర్యమే. దిగంబర కవులు అసౌందర్యాన్ని ఆరాధిస్తున్నారనీ కాదు. అంగీకరిస్తున్నారనేదే నేననేది.

ఇక రాక్షసానందం విషయం తీసుకుంటే బీభత్సంకూడా ఒక రసమే.

దీనికి స్థాయీభావం జుగుప్స. నేటి సమాజంలోని కుళ్లను బయటపెట్టి దాని మీద అసహ్యం కలిగేటట్లు రాస్తే దాంట్లో కవిత్వాని కుండవలసన ఇతర లక్షణాలుకూడా ఉన్నంతకాలం దాన్ని నేను ఆమోదిస్తాను. అదీ కవిత్వమేనని అంగీకరిస్తాను. ఒకప్పుడు నవరసాలలో శృంగారానికి, కరుణకి ప్రాముఖ్యం ఉండేది. ఈ రెండూ మనిషికీ, పశువుకీ సామాన్యమే. ఈనాడు మనకి కావలసినవి వీరం, బీభత్సం. పశువుల్లో లేనిది మానవుల్లో ఉన్నది సహనశక్తి. అందుచేత కన్యాశుల్కంలోని బీభత్సంతో మిళితమైన హాస్యరసం నాకు ఆకర్షణీయం, చాప్లిన్, డికెన్స్‌ల హాస్యం వెనుక కరుణ తొంగి చూస్తుంది ఔచిత్యమంటే చేపట్టిన ఏరసానికైనా న్యాయం చేకూర్చటమే.

కుందుర్తి :

కవిత్వం జీవితానికి వ్యాఖ్యానంగానూ దర్పణంగానూ ఉండితీరాలి. ఆనందం వచ్చినప్పుడే కాదు ఏ ఒక్క భావమైనా మాటల రూపంలో బయటికి వచ్చే టప్పుడు భాష, సభ్యత, ఔచిత్యం మొదలగు అనేక పరిమితులకు లోబడే వస్తుంది. అంత మాత్రాన కవితను అసంపూర్ణకళ అని పిలవనక్కరలేదు. నిజానికి 'సంపూర్ణకళ' అనేది ఏముంది ?

హింస చేస్తున్నవాడు మీరన్నట్లు రాక్షసానందాన్ని అనుభవిస్తూ ఉంటే దానిని వర్ణించటం వాస్తవ చిత్రణే అసలు వాడి ఆనందాన్ని బజార్లోకి ఈడ్చి తప్పని చెప్పటమే ఈ యుగంలో కవుల బాధ్యత. గుండె ధైర్యముంటే ఏ యుగంలోనైనా యిది కవి బాధ్యతే.

ఒక "భవ్య కవితావేశాన్ని" తీవ్రపదజాలంతో చెప్పటంలో తప్పేమీ లేదు. మామూలు వ్యవహారంలోకూడా కోపం వచ్చినవాడి పలుకు వాడిగానే వుంటుంది. దిగంబరకవితకూడా అంతే. ఇందులో అనౌచిత్యం ఏమీలేదు బుద్ధి ఫ్యూడల్ భావాలతో నిండి ఉన్నంతకాలం ఔచిత్యమే అనౌచిత్యంగా కనిపించే అవకాశం ఉంది.

డా. దివాకర్ల వేంకటావధాని :

కవిత్వము మానవ జీవితమునకు వ్యాఖ్యానముగా నుండవలయును. లోకమున దుష్టులు, సత్పురుషులుకూడ నుందురు. ఆ రెండు విధములైన పాత్రలూ కవి వర్ణింపవచ్చును. వర్ణించి సత్వము శ్రేయస్సునకును, దౌర్జన్యము నాశము

నకును దారిచూపునను విశ్వజనీన సత్యమును ప్రకటింపవలయును. హింసాత్మకమైన ఆనందము దుష్టులకు మాత్రమే కలుగును. దుష్టులను వర్ణించునపుడు అట్లు వ్రాసినచో అది వాస్తవమే అగును. అందులో అనౌచిత్యము ఉండదు సజ్జనునియందు దౌష్ట్యమును వర్ణించుట అనౌచిత్యము. అట్లే దుష్టునియందు లేని సౌజన్యమును వర్ణించుట మరొక విధమైన అనౌచిత్యము. దిగంబర కవిత్వమును గూర్చి ఏమి చెప్పుటకును ఇంకమా కొంత పరిశోధన చేయవలయును. కాలమేదాని బాగోగులను నిర్ణయించును.

గుంటూరు శేషేంద్రశర్మ :

కవిత్వం తన బలంచేత మనిషిని కార్యోన్ముఖుణ్ణి చెయ్యాలి. అందుచేత కవిత్వం తన శక్తిని మనిషిలో ఆశాజ్యోతి ఆరనీయకుండా ఉంచటానికే వినియోగిస్తుంది. ఈ పని చెయ్యటానికి కవిత్వం ఏ వస్తువును ఎట్లాచెప్పాలో ఒక సహజమైన అంతరంగిక అవగాహన చేతనే గ్రహిస్తూపోతుంది. ఇదిచెప్పవచ్చు, ఇది చెప్పకూడదు అని ఒక సూత్రాన్ని ప్రతిపాదించటం సాధ్యంకాదు. రాక్షసానందం, అసౌందర్యం లాంటివికూడా కవిత్వం యొక్క సహజ అంతరంగిక అవగాహన చేతనే కవిత్వంలో స్థానాన్ని గడించుకోవటమో, గడించుకోలేక పోవటమో నిర్ణయమౌతుంది. ఏదైనా అంతిమ పరీక్ష ఏమిటంటే కవిత చదువుచున్నప్పుడు పాఠకుడికి చెప్పబడుతున్న విషయంమీద ఆకర్షణ కలగాలి. దాని మోహంలో పడాలి. ఈ మోహం, ఆకర్షణ అనే కవిత్వ ప్రభావానికి విఘ్నం కలిగించగలిగిన ఏ విషయాన్ని కవిత్వంలో చెప్పకపోవటం చేతనే కవి తన విజయాన్ని సాధిస్తాడు. సిద్ధాంతం పేరు చేతనో లేక ఏదో ఒక మూర్ఖ ఆవేశం చేతనో పాఠకుడిలో వైముఖ్యం కల్గించేవాడు. తత్సంబంధమైన జ్ఞానం లేనివాడు కవి అవ్వటంకూడా దుర్లభమే.

దిగంబర కవిత్వం అనే పేరుతో చెప్పబడే రచనల్లో కవిత్వంకంటె దిగంబరత్వమే ఎక్కువ.

ఈ కవులు సాహిత్యంలో ఇంకా కృషిచేసి లోకానికి ఉపయోగించే వాళ్లుగా ఇంకా పెరగవలసిన అవసరం ఉంది. ఈ షట్కాన్ని ఉద్యమ కర్తలనికూడ కొందరు సాహిత్య విమర్శకులు వర్ణిస్తూ ఉండటం, ఆ విమర్శకుల సాహిత్యజ్ఞానం సందేహాస్పదం కావటమేకాక తెలుగు సాహిత్య భవిష్యత్తును గురించికూడ భయావహంగా ఉంది.

The author has picked up the limited combine of six minor poets who have neither grounding nor cultivation in any serious pursuit of literature modern or classical, had neither the strength nor the stature required to poineer a literary movement and has set them up, as a literary movement following the progressive period. (A few more *silly ramifications* which he indulges in a study of, before that, like Virasam, are in a study like this to be left appropriately in the broad spectrum of progressive trend itself. Because they are a part of the same rabble of writers who floated different organisations for reasons of personal bickerings rather than due to any indeological or literary variations. Strictly speaking therefore they ought not to be counted as various literary developments).

He should have verified in his study as to whether the 'Digambara-combine' had the crucial characterstics of the literary movements like Romantic movement, progressive movement either in Telugu or outside in the west. Could these bandful of persons appallingly backword in literature and learning, be placed by the side of poineers of movements like Wordsworth, Coleridge, Rayaprolu, Krishna Sastry, Sri Sri, etc. Whether an assessment like this does not militate against the sound principles of a scientific study of literature and betray the author as an under-developed critic attempting to indulge in great tasks beyend his ability and equipment.

A survey of either the Viplava poets or Digambara poets does not disclose any new trend or any significently new characteristics which were not already found in the progressive movement. The theme and the structure adopted by the Digambara and Virasam were the same as were prevailing before. The values they challenged and the values they championed were also the same as were the theme - songs of the former poets of the Abhyudaya trend. Therefore it is unscientific untenable, and exaggerated to assign to the Digambaras the role of a literary movement.

This is a general survey of the movements traced in the book by the author.

మహీధర రామమోహనరావు :

జీవిత పరిధిలోకి రాకుండా వ్యక్తి అనుభవించే వివిధ ఆనందాలు ఏమిటవి ? మాటలకు అందనివి జీవిత పరిధిలో లేని వనాలా ? ఈ ఆలోచనే అసంబద్ధం. అలాగే హింసానందాన్ని గురించిన చర్చ. వాస్తవ చిత్రణ. ఔచిత్య మాత్ర పరిధులు ఆనందానికి మాత్రం వర్తించవా ? ఇక్కడొక విషయం చెప్పక తప్పదు. ఇటీవల ఒక ప్రముఖ రచయిత తమ నవలలో హింస, బాధ అనేవి జీవితంలో ప్రతి పనిలోనూ వుంటూనే వుంటాయి గనక హింసనూ, బాధనూ నిరసించపలేదని ఒక పాత్ర చేత చెప్పించారు. ప్రాణాన్ని రక్షించేందుకు డాక్టరు సర్వప్రయత్నాలూ చెయ్యాలన్న ఆదర్శానికీ, కుదరని వ్యాధితో, అనంతమైన బాధ ననుభవిస్తూ మరణాపన్నుడైన వ్యక్తిని ఆఖరు శ్వాస వరకూ బ్రతికించివుంచే ఆచరణకూ వైరుధ్యం లేదా ? స్త్రీ పురుష సమాగమంలో, ప్రసవంలో, శస్త్రచికిత్సతో బాధ, హింసవున్నాయి. కాని వానిని సమర్థిస్తున్నాం, ప్రోత్సహిస్తున్నాం. విప్లవంతో హింసకు బాధకూ అవకాశం వుంది. అయినా ఆహ్వానిస్తున్నాం. మనిషి స్వాతంత్ర్యసాధనకు చేసే యుద్ధంలో హింసవుంది. అయినా జయగీతాలు పాడతాం. కాని, హిట్లరు సాగించిన హింసాకాండను పోలీసుశాఖ జరిపే థర్డ్ డిగ్రీ మెథడ్స్‌ను పాలకులు సాగించే జలియన్వాలాబాగ్ హత్యలను నిరసిస్తాం. వీనిని దుశ్చర్య లంటున్నాం. ఇవి కూడా మన జీవితంలో భాగంగానే వున్నాయి. వీరిని జరిపే వారిలో వానిపై విశ్వాసం మన వ్యతిరేకత కున్నంత బలమూ వుంది. అందుచేత ఈ రెండింటిని ఒకే గాట కట్టడం వాస్తవ చిత్రణం అవుతుందా ? ఈ రెండూ రచయితలోవున్న ప్రపంచ దృక్పథాన్ని, సామాజిక స్పృహను, నిబద్ధతనూ తెలిపే సూచిక లవుతాయి. దీనిలో ఔచిత్యప్రసక్తి లేదు. అది వేరు. "క్రోధం ప్రభో సంహర సంహరేతి ..........భవనేత్రజన్మా" అనే శ్లోకంలో కాళిదాసు "భవ" శబ్దం ఉపయోగించడం ఔచిత్యభంగం అన్నాడు క్షేమేంద్రుడు. చెప్పదల్చుకున్న దానికీ, చెప్తున్నదానికి విరుద్ధమైన పదప్రయోగంకూడా ఔచిత్యభంగమే. స్త్రీ సౌకుమార్యానికి పరవశత్వం చూపే కవి రేప్‌సీన్‌ను శృంగార కావ్యంలా చిత్రిస్తే అది ఎంత వాస్తవికంగా చిత్రించినా అనౌచిత్యమే !

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

ఆనందం అంటే మానవుని ఉన్నతోన్నత స్థితికి తీసికొనిపోతూ జీవత్వం నుండి దైవత్వంలోనికి మార్గం ఏర్పరచేదే అయి ఉండాలి. ప్రతిదానిని ఆనంద

పదంతో ముడిపెట్టి చెప్పడం తగనే తగదు. కవి కావ్యము విశ్వ శ్రేయస్సును చేకూర్చేదిగా ఉండితీరాలేకాని పతన శీలంగా దిగజార్చేదిగా ఉండరాదు ఈ సూత్రాన్ని పాటించక ప్రతి తుచ్ఛ వైషయికానందమునూ కవితా వస్తువుగా స్వీకరించడం జరగకూడదు.

దిగంబర కవిత్వ మనగా అట్టి తుచ్ఛ వైషయికానందమును చెప్పినదని అర్థంకాదు. కవి కల్పనలతో అలంకార రచనతో నిమిత్తం లేకుండ ఒట్టి విషయ నగ్నతతోనే ప్రజామనస్సులకు ఒక సందేశము నందించుట దిగంబర కవితా లక్షణముగా గ్రహింపవచ్చును. అచ్ఛాదన లేనిది దిగంబరత్వ లక్షణము కాని నైతిక పతనాన్ని కలిగించే వైషయిక ప్రదర్శనము దిగంబర లక్షణమను కొనుట అజ్ఞాన విలసితమే కాగలదు.

## నార్ల వేంకటేశ్వరరావు :

సమకాలిక జీవిత ప్రభావం విధిగా సాహిత్యంమీద వుంటుంది. జీవితం బహుముఖమైనది కాబట్టి సాహిత్యంకూడా బహుముఖమైనది కావాలి. విప్లవమే కాదు ప్రయణంకూడా జీవితంలో భాగమే. అందువల్ల మొదటిది కవిత్వం రెండవదికాదు అనటం అర్థం లేనిమాట. ఐతే వెనుకటి కాలానికి సంబంధించిన ప్రణయంలో ఆనాటి స్త్రీ అస్వతంత్ర ప్రతిపత్తి ప్రస్ఫుటమైనట్టు యీనాటి ఆమె సమాన ప్రతిపత్తి ప్రస్ఫుటం కావాలి. నా దృష్టిలో ఇదే కవులు తమ యుగ ధర్మాన్ని పాటించటమంటే !

6. భావకవిత్వం నుండి తీసుకుంటే — భావకవిత్వంగానీ, అభ్యుదయ కవిత్వంగానీ, ఆ తర్వాత వచ్చిన అతినవ్య కవితా ధోరణులు అంటే — అధివాస్తవికత, అరాచక వైచిత్రీ ప్రియత్వం, నిరాశావాదాలు, విశృంఖల కామభావం మొదలైనవన్నీ మనకు విదేశాల నుంచి, ముఖ్యంగా పాశ్చాత్య దేశాలనుంచి వచ్చాయికదా — మరి వీటివల్ల మన తెలుగు సాహిత్యం పరిపుష్ట మయ్యిందని మీరు అనుకుంటున్నారా ? అనుకుంటే — A ఎందుకు : B ఎలా ? అనుకోకపోతే ఇంత కవిత్వం కళ్ళముందు కనిపిస్తోంటే దాని ప్రభావాన్ని కాదనటం ఎలా ?

డా. దివాకర్ల వేంకటావధాని :

భారతీయులు కవిత్వమును భారతీయ సంస్కృతి దృష్టితోనే పరిశీలింపవలయును. ఆ సంస్కృతికి విరుద్ధమైన దెంత శక్తి మంతమైన దైనను సాహిత్యమునకు పరిపుష్టి కలిగింపజాలదు. మనము భారతీయులమైనప్పుడు, పాశ్చాత్యులవలె ప్రవర్తింపకూడదుగదా !

కవిత్వముయొక్క ప్రభావము పలితలమీద ఉండును. ఆ ప్రభావము పెద్దగా పరిణమించినచో అట్టి కవితా విధానమును మార్చుటకు యత్నింపవలయును.

డా. దాశరథి :

విదేశాల్లోంచి కొన్ని ప్రభావాలు పడతాయి. వాటిని సద్వినియోగం చేసుకునేవారు కొందరు; దుర్వినియోగం చేసుకునేవారు కొందరు. వాటిని జీర్ణించుకుని తమ ధోరణిలో తాము వ్రాసినవారు నిలుస్తారు. భావ కవిత్వ ధోరణివల్ల మన సాహిత్యంలో ఒక క్రొత్త ఒరవడి కొన్నాళ్ళు ఏర్పడిందికదా ;

డా. సి. నారాయణరెడ్డి :

ఆవు— ఆకులూ, అలములూ, పచ్చిగడ్డీ, ఎండుగడ్డీ, తింటుంది. ఐనా, అన్నిటినీ జీర్ణించుకుని తెల్లని పాలే ఇస్తుంది. ఈ శతాబ్ది తెలుగు సాహిత్యమూ అలాంటిదే. ఎన్నో పాశ్చాత్య ప్రభావాలను జీర్ణించుకుని ఎదిగిపోతూ వుంది.

కుందుర్తి :

నిజానికి "భావం" (Idea) అనే దానికి మనుషులకున్నట్లు జాతిలేదు. అది మంచిదైతే ఆయా కాలాలలో అవకాశం వున్నంతవరకు అది ప్రచారం అవుతూనే వుంటుంది. నన్నయాదుల మీద కూడా యితర భాషా సాహిత్యాల ప్రభావాలున్నాయి కదా ! అందువల్ల యీ రంగంలో దేశీయ, విదేశీయ ప్రభావాలు అనే మాట కేవలం వ్యవహారం కోసం పనికివచ్చే భేదమే. దీనికి మరో ప్రయోజనం లేదు.

భావ కవిత్వం మన సాహిత్యంలో కొంతవరకు నిలద్రొక్కుకుంది. 25 సంవత్సరాల ఉద్యమమే అయినా దానికిగల కొన్ని ప్రత్యేక లక్షణాలవల్ల అది తనకు ఒక స్థానం కల్పించుకున్నది. అభ్యుదయ కవిత్వం జీవితానికి సంబం

పెంచిన కొన్ని ప్రధాన సిద్ధాంతాలమీద నిలబడినందున దానికి చలనం లేదు. ఈ రెండు ఉద్యమాలవల్ల, తెలుగు కవిత్వం పరిపుష్టం చెందినట్లే. పోతే, అధి వాస్తవికత, అరాచక, వైచిత్రీ ప్రియత్వ, నిరాశావాద, విశృంఖల కామ భావ సాహిత్యాలను మన ప్రజలు పూర్తిగా తిరస్కరించారు. వీటివల్ల కవిత పరిపుష్ట మైందని నే ననుకోను.

అధివాస్తవికత వగైరా, వగైరాలలో ఎంతో సాహిత్యం రాలేదు. వచ్చినవన్నీ ప్రయోగాలుగా మిగిలిపోయాయి.

ఆరుద్ర :

ఉద్యమాలూ, విప్లవాలు దిగుమతి చేసుకునే సరుకులు కావు. సామాజిక పరిస్థితుల్నిబట్టి ఒక దేశంలో ఉద్యమంవస్తుంది. అటువంటి పరిస్థితులే యింకో దేశంలో ఏర్పడినప్పుడు, సరిగ్గా అటువంటి లక్షణాలున్న ఉద్యమమే రూపొందు తుంది. ఉద్యమం బలపడి విజయవంతమైతే విప్లవం వస్తుంది. వీరేశలింగం పంతులుగారి దగ్గరనుంచి యీవేళదాకా వివిధ భావవిప్లవాలు ఆంధ్రసాహిత్యంలో ప్రవేశించాయి. ఫ్యూడలిజం నుంచి సామ్యవాదానికి పయనించటంలో భావ కవిత్వం ఒక అంచె. అలాగే మిగతావి.

గుంటూరు శేషేంద్రశర్మ :

భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వాలు విదేశాలనుంచి కృత్రిమంగా యిక్కడికి దిగుమతి చేయబడిన సరుకు అనుకోవటం శాస్త్రయుక్తమైన అవగా హన కాదు అవి ప్రపంచంలో వచ్చిన రాజకీయ, సామాజిక, ఆర్థిక విలువలకు సంబంధించిన మార్పుల ప్రభావంగా వచ్చినవి. ఒక దేశంలో ముందు, మరో దేశంలో వెనుక కావచ్చు. ఈ మార్పులు విశ్వజనీనమైన మార్పులు. కానీ, తర్వాత పేర్కొనబడిన – సర్రియలిజం, డాడాయిజం – మొదలైన ఉద్యమాలు విశ్వ జనీన ఉద్యమాలుకావు. అవి స్థానికంగా యూరప్‌లో కలిగిన రాజకీయ, సామా జిక, ఆర్థిక, కల్లోలంలో నుంచి ఉత్పన్నమైనవి. వాటికి వాటి జన్మభూమి వరకే సాహిత్యప్రాధాన్యం వుంటుంది. వాటినిక్కడ, అందులోనూ — ఆధునికత యెక్కువగా లోపించిన తెలుగులో అవలంబించటం లేక అవలంబించినట్లు కని పించటం లోక వంచన అవుతుందేమో కానీ కవిత్వం అవ్వటం మాత్రం దుర్లభం.

అసలు, కవిత్వానికి ఒకటే గీటురాయి - తాను చెప్పింది తన అనుభవమై వుండాలి. అది అనుభూతి కానీ, స్వానుభూతికానీ, ప్రసిద్ధ క్రౌంచవధలో వంటి సానుభూతికానీ కావచ్చు. కానీ యీ రెండూ కాని, ఆరువేలమైళ్లు అవతల, ఈ వెనుకబడిన జాతి ఊహకు కూడా అందని స్యర్రియలిజం, డాడాయిజం మొదలైన ఉద్యమాల వంటివి ఎలా యీ కవుల అనుభూతిలో ఒక భాగం కాగల్గుతాయి ?

ఆధునిక కవిత్వం అనే పేరుతో వచ్చిన యిలాంటి కృత్రిమ పదార్థానికి ప్రజల్ని ప్రభావితం చెయ్యగలిగే శక్తి ఎలా వుంటుంది !

ప్రభావం అనేది కవిత్వానికి ప్రధాన లక్షణం. పై రచనలు కవిత్వమే కాలేకపోతున్నాయి కనక వాటికి ప్రభావమనే లక్షణంకూడా లేదు. ఈ రచనల మొహంకూడా చూసే వాళ్ళే లేరు.

**శ్రీ శ్రీ :**

ఇవన్నీ ఇవేళ ఎక్కడనుంచో దిగుమతి అయినట్టు మీరు పొరబడుతున్నారు. మనమెంతో మడిగావున్నట్టు, ఈ గాలులవల్ల మనం మైల పడిపోతున్నట్టు భ్రమించి మనలో మనమే తృప్తి పడుతున్నాం. మీరు చెప్పిన ధోరణులన్నీ తర తమ భేదాలతో అనాదినుంచి, అన్ని కవిత్వాల్లోను కనిపిస్తూనే వుంటాయి. 'మనదీ' అంటూ ప్రత్యేక సభ్యత ఏదీలేదు; ఉన్నదంతా మానవ సభ్యత. గాలికి ప్రాచ్య - పాశ్చాత్య భేదాలు లేవు. ఈనాటి అభివృద్ధి చెందిన ప్రసార సాధనాలు ప్రపంచమంతటినీ ఏకంచేస్తున్నాయి.'వసుధైక కుటుంబకమ్' అనే ఆశయం మంచిదనుకుంటే — ఎటునుంచి వీచిన గాలికైనా ప్రాణవాయువుని ప్రసాదించే గుణం వుందని మనం అంగీకరించాలి. అప్పుడు మీకు విడ్డూరంగా కనపించే ధోరణులన్నీ కవిత్వానికి ఉపాదేయాలవుతాయి.

**మహీధర రామమోహనరావు :**

పెట్టుబడిదారీ వ్యవస్థను మనదేశంలో బ్రిటిష్‌వాళ్లు తెచ్చిపెట్టేరు. నిజమే. అయితే, బ్రిటిష్‌వాళ్లు రాకపోతే మనదేశం ఆకల్పాంతం రాజరిక వ్యవస్థతోనే వుండేదా ? అది జరిగేది కాదని, మొగల్ పరిపాలన కాలానికే మన ఆర్థిక వ్యవస్థలో మార్పుకు అంకురాలు మొదలయ్యాయని బ్రిటిష్‌వాళ్లు రాకపోయినా, ఆలస్యంగానైనా మన సమాజం పెట్టుబడిదారీ రంగానికి మళ్ళి వుండేదని మన

చరిత్ర చెప్తుంది  అదే  సాహిత్యప్రక్రియలకీ వర్తిస్తుంది. ఇక్కడ మనకు కావల్సింది సాహిత్య ధోరణులూ, వాదాలూ విదేశీ సంపర్క జన్యమా, కాదా అని కాదు; వానికి మన సమాజంలో వున్న ప్రాతిపదిక లేమిటనిగాని.

ఇంకొకటి-భావ కవిత్వాన్నీ, అభ్యుదయ కవిత్వాన్నీ వాద భేదాలనుగా విప్లవ కవిత్వంతోసహా అధివాస్తవిక, అరాచక, నిరాశా, వైచిత్రీ ప్రియత్వా ముల్ని ధోరణులుగా విస్పష్టమైన అవగాహన, నామ భేదాలు చూపకపోతే మన చర్చ అలగం తొక్కుతుంది. వాదాలు విస్తృతపరిధి గలవి. వానికి సమాజం లోనే వస్తున్న పరిణామాలు మూలకం. ధోరణులు తాత్కాలికం. ఎబ్రేషన్స్. అందులో కొన్ని మరీ వ్యక్తిగతం. అధివాస్తవికత, అస్తిత్వ ధోరణివంటివి, దిగంబర కవిత, విప్లవ కవిత వంటివి సమాజంలోని రాజకీయ దుష్పరిణామాల ఫలితంగా వచ్చిన ధోరణులు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

వాటి తెలుగు సాహిత్యం పరిపుష్టమయ్యిందని ఒక్క నాటికికూడ అను కొనుటలేదు. పై కోవలో భావకవిత్వమును చేర్చుట అసమంజసం.

7. ఆధునిక సాహిత్యంలో కొన్ని వాదాలు — అంటే — మానవతా వాదం, అనుభూతివాదం — ఇలా రకరకాల వాదాలున్నాయి కదా !... వీటిమీద ఎవరి అభిప్రాయాలు వారు చెప్పటంవలన ఇదమిత్థమైన ఒక అభిప్రాయం కుదరలేదు. మీ దృష్టిలో ఆధునిక సాహిత్యాని కంతటికీ అన్వయించే ఏక సూత్రం లేదా వాదం వుందా ? ఉంటే-మీ నిర్వచనం ఏమిటి ? లేదంటే — మీ రచనల్లో ప్రధానంగావున్న అభిప్రాయం ఏమిటి ?

కుందుర్తి :

సాహిత్యంలో ముఖ్యంగా కవితారంగంలో వాదాలు ఎక్కువగానే వుంటాయి. ప్రతి విషయంలోను భేదాభిప్రాయాలు తప్పవు. దేనిమీదా ఏకాభి ప్రాయం కుదరదు. కావ్యాత్మ విషయంలో ఆలంకారికులు ఎన్నో వాదాలు చేశారు గదా ! యిప్పుడూ అంతే; ఎప్పుడూ అంతే !

అయితే, యుగ ధర్మం అనేది ఒకటి వుంటుంది. ఎప్పుడైనా దానిని ఆశ్రయించిన కవిత, దానికి సంబంధించిన అభిప్రాయాలూ బహుళ ప్రచారంలో వుంటాయి. అందుకే మీ రన్నట్లు (శివ ప్రశ్నలో) అన్ని వర్గాలవారూ యిష్టం వున్నా లేకున్నా ఆ భావాలనే చిలుక పలుకుల్లా వల్లిస్తుంటారు

నా దృష్టిలో ఆధునిక సాహిత్యానికి అంతటికీ వర్తించే వాదం "సామాజిక పరివర్తన వాదం." ఇది మార్క్సిస్టు మూల సూత్రాలమీద ఆధారపడిన వాదం. నా రచనలనిండా యిది పరుచుకుని వుంది.

గుంటూరు శేషేంద్రశర్మ :

కవిత్వంరాసే కవికి కవి జన్మ ఘడియల్లో ఏ వాదాలూ స్ఫురించవు. వాడు కేవలం వాడి అనుభూతి సుడిగుండంలో పడి పరిభ్రమిస్తున్న ప్రాణి మాత్రుడు. ఆ క్షణంలో సంబంధంలేని వాదాలకు తత్త్వతః కవిత్వంతో ఏ బంధంలేదు. కవిత్వాన్ని అనుభవించేవాడు, వాడి ఆహ్లాదానుభూతిని, వాడి కావ్య తంత్ర జ్ఞానాన్ని బట్టి వర్ణించేటప్పుడు పడే పాట్లే యీ మానవతా వాదం, అనుభూతివాదం — ఇత్యాది నామకరణాలు. ఈ నామకరణాల స్థాయి సాహిత్య విమర్శ, చాలా వరకు అపరిపక్వ మనస్కులకు స్ఫురించేదే. కవిత్వ మూల ద్రవ్యాలు, కవిత్వజన్మ ప్రకారం యింతకుముందు వివరించాను. ఆ కాంతి పుంజంలో ఈ ప్రశ్నని పరిశీలించండి. (కవిసేన మేనిఫెస్టోలో 112-151 పేజీలు చదవటం ఈ సందర్భానికి చాలా ఉపయోగిస్తుంది).

శ్రీ శ్రీ :

ఎక్కడైనా, ఎప్పుడైనా లక్ష్యం ముందు, లక్షణం తర్వాత. నేటి కవిత్వంలో ఎన్నో వాదాలు పోటా-పోటీ పడుతున్నమాట నిజమే. ఈ వైవిధ్యాన్ని నేను ఆహ్వానిస్తాను; ఆదరిస్తాను. దేశమంతటికీ ఒకే పార్టీవుంటే బాగానే వుంటుంది. అలాగే యావత్కవిత్వానికీ ఒకే సూత్రీకరణ. అంత ఎత్తుకి మన మింకా ఎదగలేదు.

డా. దివాకర్ల వేంకటావధాని :

వాదములు సిద్ధాంత దృష్టితో చూచినచో ఉదాత్తములుగనే కనిపించును. ఆనంద ప్రదాయకమైన కవిత్వములో మానవతాది వాదములు ప్రతిఫలింప

జేయుటలో దోషములేదు. కవితా ప్రధాన ప్రయోజనమైన ఆనందమును మాత్రము విస్మరింపరాదు.

**డా. సి. నారాయణరెడ్డి :**

వాదాలు అంటే అభిప్రాయ భేదాలు. ప్రజాస్వామ్యంలో అభిప్రాయ భేదాలు ఎలా సహజమో కవిత్వంలోనూ విభిన్న వాదాలు అనివార్యం. అయి నప్పుడు ఏక సూత్ర మెందుకంటాను ?

నా రచనల్లో ప్రగతిని విస్మరించని మానవీయ దృక్పథం ఉందను కుంటాను.

**ఆరుద్ర :**

వాదాలు లేబుల్సు వంటివి. లేబులు మార్చినంత మాత్రాన కవిత్వ స్వరూపం మారదు. కవిత్వంలో వుండటమే కవిత్వలక్షణం. ఏ వ్యవస్థలోనైనా దానికి సాంఘిక ప్రయోజనం వుంటుంది. అది వున్నంతకాలం దాన్ని ఏ పేరు పెట్టి పిలిచినా ఫర్వాలేదు.

**డా. దాశరథి :**

నాకు వాదాలమీద విశ్వాసం లేదు. ఒక సూత్రం ఎలా వుంటుంది ? కవి వ్యక్తిత్వంకోసం పాకులాడుతాడు. వ్యష్టిగా వుండిపోతాడు. కనుక ఎవరి రచనా రీతి వారిదే.

నా రచనల్లో ప్రధానంగావున్న అభిప్రాయం – మానవుణ్ని మానవుడిగా బ్రతకనీయమన్నదే. కొందరు అతన్ని దేవుణ్ని చేయడానికి ప్రయత్నిస్తారు. కొందరు దానవుణ్ని చేస్తారు. నాకు దేవదానవులు అక్కరలేదు. కావలసింది మానవులే. వారే కరువవుతున్నారు. వారిని వెతుక్కొంటున్నాను.

**మహీధర రామమోహనరావు :**

నా దృష్టిలో ఒకే సూత్రంవుంది–"ప్రతిదానినీ సాపేక్షంగా (Relative) నే తప్ప నిరపేక్షంగా (Absolente) తీసుకోరాదు"—అని, ఉదాహరణకి మానవత్వం వుంది. కుల, వర్గ వ్యవస్థను నిరపేక్షంగా సమర్థించే ఆ విశ్వనాథ

(6)

వారు తమ శ్రీకుమారాభ్యుదయంలో "పంచియిండు మీమీ పొలముల్ కాలోప హతులు పేదల కాలోపము. పూర్తిచేయుడు"—అంటారు. ఇది మానవతాదృష్టి. మానవుల మధ్య అంతరాన్ని పాటించరాదంటూ వర్గ భేదాలకు ఆటంకం చెప్పని మానవత్వం వుంది; బూర్జువా సమాజంలో.

వర్గ భేదాలనూ, వర్ణ భేదాలనూ కూడ నిరాకరించి అందరు మానవుల అభ్యున్నతికి కృషి చెయ్యాలంటున్న మానవత్వంవుంది. సోషలిస్టు, కమ్యూనిస్టు సమాజాలలో, ఈ మూడు పంథాలేకాదు. వానిలో మళ్ళీ ఛాయాభేదాలు; అంత రాలు ఎన్నో. అన్నింటిలో సాహిత్యం వుంది. వీనికి ఏక సూత్రత ఏమిటి? ఒక్కటే-ప్రతి ఒక్కవాదమూ సాపేక్షం. ప్రతి ధోరణీ, ప్రతిపంథా సాపేక్షం. నిరపేక్షతకోసం అన్వేషణ బుద్ధి జాడ్య జనితం.

డా. వేదుల సూర్యనారాయణశర్మ:

కవిత్వంలో విభిన్న దృక్పథములుండుట తప్పుకాదు. అవి ఏనాడూ ఉన్నవి. అన్నిటిలోనూ ప్రజామనస్సును ఉజ్జ్వలముగా ఉన్నత దృక్పథానికి మళ్ళించడం అనే మూల సూత్రం ఉండనేఉంటుంది. వివిధపుష్పాల్ని మాలగా కూర్చే దారంవలె ఆ ఏక సూత్రంతో పై విభిన్న వాదములన్నియు ఏక రూప మున ప్రదర్శింపబడగలవు. మాలనుండి ప్రతి పువ్వును విడదీసి చూడకూడనట్లే పై సూత్రము నుండి విభిన్నతలను పైకెత్తి చూపించుట తగదు.

నార్ల వేంకటేశ్వరరావు:

నేను నాస్తిక వాదినని యింతకుముందే చెప్పాను. నాస్తికవాది విధిగా మానవతావాది కావాలి. అందువల్ల మానవతా వాదానికి ప్రోది చేసే సాహిత్యం యీనాడు మనకు కావాలనే నా గట్టి నమ్మకం. ఆ సాహిత్యం ఫ్రీవెర్స్‌గా వెలు వడినా లేదా మధ్యాక్కఱలలో వెలువడినా నామటుక్కునేను దాన్నే ఆహ్వా నిస్తాను. నాకు కావల్సింది "రేపటి మనిషి" కవిత్వం.

8. ఆధునిక సాహిత్య సృష్టి చెయ్యటానికి ప్రాచీన సాహిత్య పరి చయం అవసరం లేదంటారు కొందరు. వ్యుత్పత్తిలేకుండా ప్రతిభ మాత్రం వుంటే మంచి కవిత్వం రావటానికి వీలుంటుందా? మీ అను భవం ఏమిటి? మీ ఆదేశం ఏమిటి?

కుందుర్తి :

ఆధునిక వచన కవిత్వం రాయడానికి ప్రాచీన సాహిత్య పరిచయం అవసరంలేదని నేను ప్రచారం చేస్తున్నాను. ఎందుకంటే ఆధునిక వచనకవిత్వం ప్రజల అవగాహన అనే విషయానికి అత్యంత ప్రాధాన్యంవుంది. ఆనాటి సంస్కృత శబ్దాడంబరంగానీ, అలంకార బాహుళ్యంగానీ, క్లిష్ట పదబంధ నిర్మాణంగానీ యీనాటి ప్రజల స్థాయికి అందవనే దృష్టితోనే యీ సాహిత్య విప్లవం జరిగింది. మరి ఆనాడు అందాయా ? అంటే; అందాలనే స్పృహ వారికి లేదు. ఇప్పుడు ఆ స్పృహ లక్ష్యంగా మారింది. అందువల్ల ఆనాటి ఊబిలో యిరుక్కుని కాలం వృధాచేయడం అనవసరం. ఇది ముఖ్యంగా కవితావ్యవసాయ ప్రారంభదశనుఉద్దేశించి నేను చెప్తున్నాను. కవి కొంత దూరం ప్రయాణం చేశాక అతని యిష్టం. ప్రారంభవిద్య మాతృభాషలోనే వుండాలి; వ్యక్తి పెద్ద యిన తర్వాత ఏ భాషైనా చదువుకోవచ్చు అన్నట్లు.

ఆధునిక వచన కవిత్వానికి ఏ లక్షణాలు రూపొందినాయో అవి పూర్వ సాహిత్యంలో లేవు. అవన్నీ చదివి యిది రాయబోతే బండి దార్లకుపోయే ప్రమాదం కూడా వుంది. ఈ నా మాట వస్తువుకూ, రీతికీ సమానంగా వర్తిస్తుంది.

వ్యుత్పత్తి అనే మాటలో కేవలం గ్రంథ పరిశీలన మాత్రమే యిమిడి లేదు. దానిలో ప్రధానాంశం లోక విషయజ్ఞత. చాలామంది దీన్ని విస్మరించి మాట్లాడతారు.

కవికి అన్నింటికంటె "ప్రతిభ వేయిరేట్లు గొప్పది"—నా మాటకు వస్తే నాకు పూర్వగ్రంథ పరిశీలన, నేటి లోక విషయజ్ఞత రెండూ వున్నాయి. కానీ మొదటిదాన్ని కొత్త కవులకు ఒక అర్హతగా నిర్ణయిస్తే నేను ఒప్పుకోను.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఆధునిక కవిత్వం రాయటానికి ప్రాచీన కవిత్వ అధ్యయనం అత్యావ సరం. (తెలుగులో మాత్రం కాదు !) సాహిత్యాధ్యయనం వ్యుత్పత్తిలో ఒక అనివార్యభాగం. వ్యుత్పత్తే ప్రతిభని కల్పిస్తుంది. సహజసిద్ధంగా ప్రతిభవున్న చోట మంచి ప్రరోచన కల్గిస్తుంది. ప్రపంచపు ఉభయ భాగాల్లోనూ పూర్వం

నుంచి ఈనాటి వరకు వచ్చిన కావ్యకోవిద పరంపర వ్యుత్పత్తి కవికి అనివార్యమనే భావించారు. అంటే ఇది మెజారిటీ అభిప్రాయం కూడా.

శ్రీ శ్రీ :

ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యవల్సిన అవసరం గురించి చెబుతూ నేనొకప్పుడు "ఇవాళ ఎలా రాయకూడదో తెలుసుకోటానికి ఈ అధ్యయనం కావాలి" అన్నాను. ఎంత ప్రతిభావంతుడికైనా ఎంతోకొంత వ్యుత్పత్తి కూడా వుంటుంది. ప్రతిభకూడా నూటికి పదిశాతం మాత్రమే Inspiration తతిమ్మాదంతా Prspiration అన్నదాంట్లో చాలా నిజంవుంది. నా అనుభవం కూడా ఇదే. ఇక ఆ దేశం అంటారా అది ఎవరికివారు తేల్చుకోవల్సిందే.

డా. దివాకర్ల వేంకటావధాని :

వ్యుత్పత్తిలేని ప్రతిభ అస్పష్టతకు కారణమగును. ప్రతిభానుగుణముగా వ్యుత్పత్తికూడా నున్నప్పుడే వ్యక్తీకరణము సులభము, స్పష్టము, ఆనందదాయకము అగును. భావముల కొరకు కాకపోయినను వ్యక్తీకరణ సౌష్ఠవము కొఱకైనను ప్రాచీన కవిత్వమును చదివి తీరవలయును.

డా. సి. నారాయణరెడ్డి :

అవసరమంటాను నేను. వ్యుత్పత్తి కండ, ప్రతిభ గుండె. అభ్యాసం ఊపిరి. ఈ మూడుపాళ్ళూ కుదిరినవాడే మంచికవి అవుతాడు.

ఆరుద్ర :

ప్రతిభా, వ్యుత్పత్తుల్లో ప్రతిభ గరీయసీ అన్నది నిర్వివాదం. ప్రతిభ వుంటే వ్యుత్పత్తి క్రమంగా వస్తుంది. దానికి లోక పరిశీలన చాలా అవసరం. లోకంలో ప్రాచీన కావ్యాలు సజీవంగా ఉన్నాయి. పలుకుబళ్ళు, నానుళ్ళు ప్రజా భాషలో ఎప్పుడూ సజీవంగానే వుంటాయి. వాటిని ఆకళింపు చేసుకొని సందర్భశుద్ధిగా వాడటమే వ్యుత్పత్తి.

డా. దాశరథి :

ప్రాచీన సాహిత్య పరిచయం ఉంటే మంచిది. లేకుండా వ్రాయలేమని కాదు. వ్రాయవచ్చు. వేమనకు ప్రాచీన సాహిత్య పరిచయం ఉందా ? అని

కొందరడుగుతున్నారు. ఉందనే నా అభిప్రాయం. ప్రతిభ, వ్యుత్పత్తి - రెండూ ఉండాలి. రెండింటిలో ఏది కొరవడినా ఆ కొఱత రచనలో కనిపిస్తుంది.

మహీధర రామమోహనరావు :

రచయిత సంస్కారాన్ని పట్టి అతని రచన మంచి చెడ్డలు, వాని పరిమితులూ వుంటాయని నా అభిప్రాయం. సంస్కారం అంటే ఏమిటి ? మానవ జాతి ఈనాటి వరకు మానసికంగానూ, భౌతికంగానూ పొందిన అభ్యున్నతి యొక్క సమాహారం సంస్కారం అంటాను. వివిధదేశాల, వ్యక్తులసంస్కారం అందులో భాగమే. ఇది దేశ, కాల, వస్తుగతం. అందుచేత యీ సంస్కారం కూడా సాపేక్షమే. తనచుట్టూవున్న జీవితం నుంచి సహజంగా పట్టుపడే సంస్కారాన్ని వ్యక్తి, అధ్యయనం, దేశ పర్యటనాదుల ద్వారా పెంచుకోగలడు. మన రచన మన సంస్కారాన్ని ప్రతిబింబించాలంటే ప్రాచీనమూ, అధునాతనమూనేకాదు. మన ఆలోచనల్ని సమర్థించేదీ, వ్యతిరేకించేదీ కూడా చదవాలి; అవగాహనతో చదవాలి. ఓపెన్ మైండ్‌తో. క్రిటికల్‌గా చదవాలి. లేకుంటే మనకు పట్టుబడేది సంస్కారంకాదు. చిలుక పలుకలు. అవే మన రచనలలో కానవస్తాయి.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

కవిత్వానికి ప్రతిభయే ప్రధానమైనా ఆ కవిత్వాన్ని పలువుర కందించాలంటే అందరకు ఆస్వాద యోగ్యమైన ఒక శైలిని నిర్మించుకోవాలి. ఆ శైలీ నిర్మాణమే వ్యుత్పత్తి అవుతుంది. వ్యుత్పత్తి అంటే 'గొప్ప పాండిత్యము' అని మాత్రమే అర్థము చెప్పరాదు. ఉన్న ఆహార పదార్థములను రుచివంతములుగా వంట చేయుటకు కావలసిన పాత్ర సామగ్రివలె వ్యుత్పత్తిని ప్రకటింపవచ్చును. ప్రధానము పాక శుద్ధియే యైన, దానికి పాత్ర శుద్ధికూడా అవసరము. అట్లే కవిత్వమునకు ప్రతిభయే ప్రధానమైనను దానికి తగిన వ్యుత్పత్తి కూడా అత్యావసరముగ కావలసియున్నది.

9. ఇప్పుడు కవిత్వం రాయటంకన్న ఇలా వుండాలంటూ కవిత్వ లక్షణ్యం చెప్పటం ఎక్కువైపోయింది, ఎవరి లక్షణం వారిదిలావుంది. మరి మీరు చెప్పే కవిత్వలక్షణం ఏమిటి ?

ఆరుద్ర :

వివిధ చారిత్రక పరిస్థితుల్లో ప్రతి ఆధునిక కవీ తన కవిత్వ లక్షణానికి నిర్వచనాలు చేస్తాడు. నన్నయగారు 'సారమతిం గవీంద్రు' లని చెప్పారు గదా. తిక్కనగారు నిర్వచనోత్తర రామాయణంలో ఒకటి కాదు రెండుకాదు చాలా పద్యాల్లో తన కాలంనాటి కవిత్వ వ్యవస్థను వివరించి, తాను చెప్పదలచుకున్న తీరును విశదం చేశారు. అల్లసాని పెద్దన్న సరేసరి. 'పూతమెఱుంగులున్' పద్యంలో కవిత్వం ఎలా వుండాలి, ఏమి చేయాలి అనేది. ఇన్ని ఉదాహరణలు ఎందుకు చెపుతున్నానంటే సాహిత్యంలో కొత్త ఉద్యమం వచ్చినప్పుడల్లా ఇది తప్పనిసరి. ఆధునికుల్లో ఆద్యుడు గురజాడ.

"ఆకులందున అణిగి మణిగి
కవిత కోయిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమం
దభిమానములు మొలకెత్తవలెనోయ్"

అని చాటలేదా ?

శ్రీ శ్రీ ఫలానా వస్తువులు కావాలోయ్ నవ కవనాని కని జాబితాయే ఇచ్చాడు. నారాయణబాబు తాను విప్లవ కవిని, విద్రోహ ఋషిని అని చెప్పుకున్నాడు. పటాభి వచనపద్యం దుడ్డుకర్రతో పద్యాల నడుం విరగగొడతానని చెప్పాడు. ఆయా పరిస్థితుల్లో కవిత్వలక్షణాన్ని నిర్వచించటం తప్పులేదు.

శ్రీశ్రీ :

కవిత్వం ఎక్కువయ్యిందో, దాన్ని గురించి వాగడం ఎక్కువయ్యిందో నాకైతే తెలియదుకాని 'Talking Shop' అనేది కవులందరికీ సహజమే. వాదోపవాదాలవల్లనే వాస్తవం బయట పడుతుంది. నేను కవినేగానీ అలంకారికుణ్ణికాను. కవి నన్నమాట మరిచిపోకుండా ఒక అలంకారికుడిగా మాట్లాడవలసి వస్తే ధ్వన్యలంకారాన్ని అభిమానిస్తున్నానని చెప్పాలి. కమ్యూనిజాన్ని ధ్వనించేదే కవిత్వమని ఒకప్పుడు నేనన్నమాట ఇక్కడ జ్ఞాపకం చేస్తున్నాను.

డా. సి. నారాయణరెడ్డి :

కవి — కవిత్వలక్షణాలు చెప్పటం ఎప్పుడూవుంది. ప్రాచీన కావ్యావతారికల్ని చూస్తే తెలుస్తుందిది. కవిత్వానికి లక్షణాలు చెప్పటం దోషంకాదు. అలా

చెబుతూపోతూ అసలైన కవిత్వం చెప్పకపోవడం తప్పు. అనుభూతినీ, అవేశాన్నీ సొగసుగా, పదునుగా, గుండెలను తట్టి మేల్కొలిపేటట్టు చెప్పటం కవిత్వం కర్తవ్యం.

డా. దాశరథి :

కవిత్వలక్షణం చెప్పటం ఎక్కువైనమాట నిజం. అది సరికాదని నా అభిప్రాయం. సృష్టి మొదలు, తరువాత తక్కిన విషయాలు. లక్ష్యం మొదట— తరువాతే లక్షణం. నా కవిత్వానికి క్లుప్తత, ఆప్తత, గుప్తత – ముఖ్యలక్షణాలు.

కుందుర్తి :

కొత్తగా సాహిత్య విప్లవం ఏదైనా వచ్చినప్పుడు, అంటే సాహిత్యపు విలువలు, లక్ష్యాలు మారినప్పుడు 'నా కవిత్వం' ఇది అని తన కవిత్వరూపంలోనే లక్షణం చెప్పుకుంటాడు. ఇది ప్రారంభంలో. తరువాత తరువాత ఇది అనవసరం అనిపిస్తుంది. కానీ కొత్తగావచ్చిన ప్రతి కవికీ ఇది కొత్తేకదా. అందుకని తానేది విశ్వసిస్తున్నాడో అది చెప్పుకుంటాడు. దీని వల్ల ఎవరికీ నష్టంలేదు.

సాధ్యమైనంత ఎక్కువమంది ప్రజల అవగాహన పరిధిలోకి వెళ్ళటానికి ప్రయత్నించటం నా దృష్టిలో యీనాటి కవి ప్రధాన బాధ్యత. అందువల్ల సామాజిక స్పృహ, సారళ్యం ప్రధాన లక్షణాలవుతాయి.

డా. దివాకర్ల వేంకటావధాని :

నాది సంప్రదాయ మార్గము. పూర్వ లాక్షణికులు ఎంతో శ్రమించి, పరిశోధించి కవితాలక్షణములను నిర్వచించిరి. అంతకుమించి నేనేమియు చెప్పలేను.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఏదైనా ఎక్కువైపోటానికి కారణం ఈనాడు అనేక రాజకీయ సామాజిక కారణాల మూలంగా విద్యావిహీనత పుంజుకున్న బలమే. అయితే ప్రజాస్వామ్యంలో అన్నీ ఓటింగ్ పద్ధతి ప్రకారమే నిర్ణయమవుతాయి. సాహిత్యం కూడా. ఈ విపరీత పరిస్థితుల్లో ఎవడికివాడే త్రికరణ శుద్ధితో కృషిచేసి సత్యాసత్య నిర్ణయం చేసుకోవాలి. నే నింతవరకు చెప్పిన కావ్యమర్మాలనుబట్టి నా లక్షణ మేమిటో గ్రహించుకోమని మనవి.

మహీధర రామమోహనరావు :

కవిత్వ లక్షణం చెప్పడం ఎక్కువ కావడం ఆక్షేపణీయంకాదు. కవిత్వాం గురించి ఆలోచిస్తున్నారని దాని అర్థం. అది మంచిదే. అయితే ఆ చెప్పడం ఆరోగ్యకరమైన పంథాలో చర్చగా సాగేందుకు సాహిత్యాన్ని పరిశీలించేందుకూ తోడ్పడితే మన సాహిత్యం భవిష్యత్తు బాగుంటుంది.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

"కం వయతి ఇతి కవిః" సుఖమును, లేక, ఆనందమును సేయువాడు కవి-అని పైన చెప్పియే యున్నాము. 'కవి' పదంలో కవితాలక్షణం నిబంధింపబడియే యున్నది.

9. A ఆధునిక వచన కవిత్వానికి మీరేదైనా లక్షణం చెప్పగలరా?

ఆరుద్ర :

మంచి కవిత్వానికి వర్తించే లక్షణమే వచన కవిత్వానికీ వర్తిస్తుంది.

డా. సి. నారాయణరెడ్డి :

లక్షణమంటే స్వరూపం. లక్ష్యమంటే ఆశయం. ఛందస్సుల ముసుగుల్లోనుంచి బయట పడటం వచన కవిత్వం లక్షణమైనప్పుడు, చెప్పదల్చుకున్నది నీళ్ళు నమలకుండా, డొంక తిరుగుడు లేకుండా చెప్పడం దాని లక్ష్యం కావాలిగదా.

డా. దాశరథి :

ఆధునిక వచన కవిత్వానికి ఇదమిత్థమని లక్షణం ఏమీ చెప్పలేను.

కుందుర్తి :

ఆధునిక వచన కవిత్వానికి లక్షణం చెప్పాలంటే నేను లాక్షణికుణ్ని కాను. నావంటి కవులు చెప్పిన విషయాలను నిశితంగా పరిశీలించి మంచి చెడులు నిర్ణయించి లక్షణం నిర్మించే బాధ్యత లాక్షణికులదే.

డా. దివాకర్ల వేంకటావధాని :

వచనములో వ్రాసినంతమాత్రమున కవిత్వము కవిత్వము కాకపోదు. స్పష్టముగను, రసవంతముగను వచనకవిత్వము చెప్పవచ్చును. కావున, స్పష్టత, రసవత్త వచన కవిత్వమునందు ప్రాధాన్యము వహించవలెను.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఆధునిక వచన కవిత్వానికి ''వచనత్వం'' ఒక్కటే లక్షణం. నా దృష్టికి మరేమీ కనిపించటంలేదు.

శ్రీ శ్రీ :

వేగం - ఆవేగం - ఇవే ఆధునిక వచన కవిత్వానికి లక్షణాలు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

నేటి ప్రజామనస్సుకు హత్తుకొనేటట్లు శైలిని మార్చి చెప్పడమే అధునిక వచన కవితా లక్షణంగా చెప్పవచ్చు.

నార్ల వేంకటేశ్వరరావు :

ముఖ్యంగా వచన కవిత్వ రచనలో (Deseptive Simpliciti)—విశేష సౌలభ్యం వున్నట్లు స్థూలదృష్టికి గోచరిస్తుంది అందువల్ల పేజీలకు పేజీలురాసి పారేస్తున్నారు; అంత్య ప్రాసలతోనో, ఆది ప్రాసలతోనో, ఈ రచనలలో జగిగానీ, బిగిగానీ కనబడటంలేదు. కనీసం ఒక క్రొత్త ఫక్కీలో పలకటమైనా కానరావటంలేదు. శ్రీ శ్రీ వచన కవిత్వంరాసింది సంప్రదాయబద్ధమైన కవిత్వంమీద ఎంతో అధికారాన్ని సంపాదించినమీదట దానిపట్ల వైముఖ్యంతో, కొత్త మార్గాన వెళ్ళాలన్న దీక్షతోనే. ఆ విధమైన అధికారం లేనివారు వచన కవులుగా రాణించగలరని నామటుక్కు నేను అనుకోను. వచన కవిత్వమైనా, సంప్రదాయ కవిత్వమైనా చిత్తశుద్ధి లేనట్టిది కవిత కాలేదు.

9. (B) ఇప్పుడు "మినీకవిత" లని వస్తున్నాయి. వాటిమీద మీ అభిప్రాయం ఏమిటి ?

**కుందుర్తి :**

మినీకవితలు ముక్తకాల వంటివి. ఇదే ఒక ప్రక్రియ, యిదే ఒక end అంటే నేనొప్పుకోను. ఇది అభ్యాసానికి పనికివస్తుందని నేననుకుంటాను. ఇందులో సమాజస్పందనలను పూర్తిగా ప్రతిఫలించటానికి వీల్లేదు వీటి ద్వారానే ప్రజల్లో చైతన్యం తీసుకురావడం కష్టం. ముఖ్యంగా మార్క్సిస్టు భావాలను విశ్వసించే యువకులు దీన్నిగురించి బాగా ఆలోచించాలి. మినీకవితలు రాసే వారు వేమన ప్రభృతులను పోలిక తెచ్చుకుంటున్నారు. కాని వీరు Expression విషయంలో వేమన ప్రభృతులు సాధించినంత సారళ్యం సాధించారా ? కనీసం ఆ ప్రయత్నమైనా చేస్తున్నారా ? పాశ్చాత్య ప్రభావంతో తెలుగువాడికి అర్థంకాని పద చిత్రాలను ప్రదర్శిస్తున్నారు. తెలుగు భాషలోని నుడికారాలను చాలా వరకు విస్మరిస్తూ, మరొకవైపు జానపద సాహిత్యంలోని పాటలతో పోలిక తెచ్చు కుంటారు. ఇదేమిటీ వింత !

**గుంటూరు శేషేంద్రశర్మ :**

ఒకప్పుడు మిత్రుడు కుందుర్తి ఆంజనేయులుగారు ఈ మినీ కవితల వ్యాధి తెలుగుకు సోకించిన నేరం నేనే చేశానని ఆరోపించి 'మందే సూర్యుడు' "ఆ క్రిమి" అన్నాడు. నా అభిప్రాయంలో మినీ కవితలు కానీ, వచన కవితలు కానీ, ఛందో కవితలుకానీ - కవితలుగా వుంటే చాలని మాత్రమే. వాటి బహిః స్వరూపం చాలా అప్రధానం. ఏది అప్రధానమో దానిమీదనే వీరావేశం పెంచు కుని విర్రవీగటం తెలుగు లక్షణం.

**శ్రీ శ్రీ :**

అల్పాక్షరముల అనల్పార్థ రచన మనకేమీ కొత్తదికాదు.

**డా. దివాకర్ల వేంకటావధాని :**

మినీ కవిత్వమున ఏదో ఒక భావమును చెప్పుటకు వీలుండునే కాని రసానందమును కలిగించు గుణము ఉండదు. అందులో కూడ ఆనందము కలిగింపజాలినచో వానిని కొనసాగింపవచ్చును.

**డా. దాశరథి :**

మినీ కవితల్లో కొన్ని చాలా బాగుంటున్నాయి. ఐతే చరణాల్నిబట్టి కాకుండా భావ క్లుప్తతనిబట్టి 'మినీ', కవిత్వాన్ని నిర్ణయించాలి.

డా. సి. నారాయణరెడ్డి :

అవి మినీ కవితలేకాదు — సౌదామినీ కవితలు. అది మెరిసేది క్షణం సేపే అయినా, గుర్తుంటుంది చాలాకాలం.

ఆరుద్ర :

మినీ కవిత్వం ఈనాడు ఒక చారిత్రక అవసరం.

మహీధర రామమోహనరావు :

మినీ కవితలూ, కార్టు కథలూ, నవలికలూ వంటివి రావడం శుభ సూచకం అంటాను. కొద్ది మాటలతో అందంగా తన అభిప్రాయాన్ని అందించేందుకు చేసే ప్రయత్నం అభినందనీయం.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

కవిత్వమునకు మినీ, మెనీ అనే తేడా ఏమియూ లేదు. 'వాక్యం రసాత్మకం కావ్యం' అని చెప్పబడియే యున్నది కదా.

10. కవికి కల్పించే అధికారంలేదు. ఉన్నదున్నట్లుగా, వాస్తవంగా చెప్పటమే ధర్మమన్నప్పుడు – ఆ చెప్పిన దాన్ని కవిత్వమని ఎందు కనాలి? అప్పుడు వాడు కవి ఎలా ఔతాడు?

ఆరుద్ర :

కవికి కల్పించే అధికారం లేదని ఎవరన్నారు? కవి కల్పనే కమ్మని వాస్తవంకాక తప్పదు. కళాపూర్ణోదయం పూర్తిగా కల్పనకాదా? అయినా దానంత కథా వైవిధ్యం ఎందులోవుంది? "అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః"—కవి కల్పనల్ని సృష్టిస్తాడు; అవి నిజంలాగ నిత్యం బ్రతుకుతాయి. ఒక శుచిముఖిగానీ, ఒక మధురవాణిగాని వాస్తవంగా వుండవు; సాహిత్య లోకంలో శాశ్వతంగా వుంటాయి.

కుందుర్తి :

కొద్దో, గొప్పో కల్పన లేకుండా కవిత్వం అనేది వుండదు. నిజానికి వ్యవహారమే వుండదు. ఆ కొద్దిపాటి కల్పనకైనా వాస్తవికతే పునాదిగా

వుంటుంది. వాస్తవ పరిస్థితులను ప్రదర్శించి, ఆ విధంగా ప్రజలను చైతన్యవంతులను చేయటం, సమాజంలో, మార్పుకు ఆ విధంగా దోహద పడడమే ఆధునిక కవిత లక్ష్యం. అదే ధర్మం.

అయితే, కల్పన అనేది ఎక్కువ మోతాదులోవుంటే తప్ప అది కవిత్వం కాదనే భ్రాంతి మనకు శతాబ్దాలుగా వుంది. ఆ దృష్టితో చూచినవారు ఫలానిది కవిత్వంకాదు అనుకుంటే అనుకోవచ్చు. అది వారి అవగాహనలో లోపం అని కవి అనుకుంటాడు.

శ్రీ శ్రీ :

కల్పించే అధికారంలేదని ఎవరన్నారు ? వాస్తవం నుంచి పలాయనం కాకూడదనే నేననేది. వాస్తవాన్ని కవిత్వానికి పునాది చేసుకోవాలి; స్వప్నానికి కూడా వాస్తవమే పునాది అయినట్టు. అప్పుడే మంచి కవిత్వం మనకి లభిస్తుంది.

డా. దాశరథి :

కవికి కల్పించే అధికారం లేదనడం సరికాదు.

డా. దివాకర్ల వేంకటావధాని :

ఉన్నదున్నట్లుగా చెప్పినచో అది చరిత్రయగును, కాని కవిత్వము కాదు. కవిత్వమనిపించు కొనుటకు కొంత చమత్కారము, వ్యంగ్యము, రసము-ఉండి తీరవలయును.

డా. సి. నారాయణరెడ్డి :

కవికి కల్పించే అధికారమూవుంది. అవసరమూవుంది. ఎంతవరకు ? అది వాస్తవాన్ని మింగేయనంత వరకు.

గుంటూరు శేషేంద్రశర్మ :

కవికి కల్పించే అధికారం నిజంగాలేదు. కవిత్వం నిష్కర్షగా అనుభూతిలో నుంచే పుట్టాలన్నది సిద్ధాంతం. ఈ విషయం కావ్యమర్మాలు పరిశీలించిన మేధావులందరూ చెప్పినదే. కాని దీని అర్థం - వాస్తవాలను వున్నవి వున్నట్లుగా చెప్పటం అన్నదికాదు. అది వర్తమాన తెలుగు కవుల అవగాహన మాత్రమే !

కవి వాస్తవాల నుంచి వస్తు తత్త్వ స్ఫోరకమైన ఒక మహిమోపేత ఇంద్రజాలన్ని సృష్టిస్తాడు. ఈ యింద్రజాలం వాస్తవాల సన్నికర్షణచేత జ్వలించిన విస్ఫులింగాల కాంతి మండలం. ఆ విస్ఫులింగాలు - ప్రతీకలు, బింబాలు, అలంకారాలు. ఇది ఒక ద్రష్టృత్వం

"తల పక్షిచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపు కూల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకులుషస్స్నాత ప్రయాతద్విజా
వళి పిండీ కృత శాటులన్ సవి తమా వాసంబులం జేర్చ బా
వుల యందున్ వెసడిగ్గు వాని గని నవ్వున్ శాలి గోపాల్యముల్"

ఈ కృష్ణరాయ కవితలో పొలాల్లో కాలువల మధ్య చల్లగా నిద్రించే బాతువు వాస్తవం. సాధారణ చర్మచక్షువులకు కనిపించే భౌతిక వస్తువు. అంత మాత్రమే చెప్పి వూరుకున్నట్లయితే అది కవిత్వంకాదు; వన వర్తమాన వచన కవులకు మాత్రమే కావచ్చు. కానీ లోకమంతటా అసి కవిత్వంకాదు. ఆ వాస్తవమైన బాతు పాలేర్లకు బ్రాహ్మణులు స్నానం చేసేటప్పుడు, పిండి, పొలం గట్ల మీద పెట్టుకున్న తడివస్త్రపు ముద్దగా కనిపించినట్లూ, వాటిని తీసుకొనిపోయి బ్రాహ్మణులకు చేరుద్దామని పాలేర్లు ముట్టుకోబోగా ఆ బాతులు తుర్రున బావుల్లోకి పారిపోవటం - ఇత్యాద వ్యవహారం ఏదైతే కవికి కనిపించిందో ఆ రెండవ భాగం చేతనే కవిత్వం పుడుతుంది. కనక కవిత్వం వాస్తవ, ద్రష్టృత్వ సిద్ధ అవాస్తవ దృశ్య ద్వయ సంయోజనం. ఈ సంయోజన ఏదో అదే అలంకారం అలంకారంలోనే బింబ ప్రతీకలనే అవయవాలున్నాయి. ఈ సమస్త కావ్య వ్యవహారం చేతనే కావ్య విదులందరూ చెప్పినట్లే Graham Hough కూడా "Art does not inmitate the external world, it expresses the feelings of the artists" అని చెప్పాడు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ:

వాస్తవమను వాస్తవముగనే చెప్పినచో వాడు కవియేకాదు. వాస్తవమును రమణీయముగ శిల్పముతో చెప్పినపుడే అది కవిత్వమగును.

11. కవిత్వంలో కొందరు శిల్పమంటారు - అంటే ఏమిటో ఒక్క ఉదాహరణతో చెప్పగలరా?

ఆరుద్ర :

శిల్పం వాళ్ళ వాళ్ళ ప్రతిభల దస్తూరీ వ్యక్తిత్వానికి తార్కాణం. నిజమైన ప్రతిభావంతుడికి తప్పించి యింకెవరికి సొంత శిల్పం అంటూ వుండదు. అది అనర్గళం, అనితర సాధ్యం !

కుందుర్తి :

తిక్కనగారు 'శిల్ప' శబ్దాన్ని ఏ అర్థంలో వాడినా, యిప్పుడు మాత్రం దీనికి 'Technic' అనే అర్థంలో రూఢం అయింది. దీన్ని ఒక్క ఉదాహరణలో చెప్పడం.........!

శ్రీ శ్రీ :

అక్షర శిల్పము, అర్థ శిల్పము అని కవిత్వంలో రెండు శిల్పాలుంటాయి. వీటికి అవినాభావ సంబంధంవుంది; ఇందాక నేను చెప్పిన శరీరం-ప్రాణంలాగ. ఉదా :— "కూపనటద్భేకములకు గగనధునీ" అంటే "నాకధునీ" అని మార్చమన్నాడట కృష్ణదేవరాయలు. 'గగన' అన్నా 'నాక' అన్నా అర్థశిల్పంలో తేడాలేదు. కానీ యీ చిన్ని మార్పువల్ల అక్షరశిల్పం ఎంతగానో శోభించింది.

డా. దాశరథి :

శిల్పాన్ని నిర్వచించటం కష్టం. ఫలానా రచనలో శిల్పం ఉందా, లేదా అని పాఠకుడే నిర్ణయించుకుంటాడు. అయినా శిల్పాన్ని గురించి నిర్వచించటానికి ప్రయత్నించటంలో తప్పులేదు. చెప్పేదాన్ని సొగసుగా చెప్పడమే శిల్పం అనుకుంటాను. శిల్పంకూడా అనేక రకాలు. శబ్దశిల్పం, అర్థ శిల్పం, వగైరా— చూడండి.

"ఎంత తియ్యని పెదవులే ఇంతి నీవి
తిట్టుచున్నప్పుడుం గూడ తీపి కురియు"

—ఇక్కడ అర్థశిల్పమేకాదు భావశిల్పంకూడా వుంది.

డా. దివాకర్ల వేంకటావధాని :

కవిత్వమనగా కథా కథనము, భావ వ్యక్తీకరణము, పాత్ర పోషణము, రసపోషణము, పద ప్రయోగము అను అంశములతో కూడియుండును. వీని

అన్నింటియందును శిల్పము కలదు. నన్నయ యందు కథా కథన శిల్పము, తిక్కనయందు రసపాత్ర పోషణ శిల్పము, పోతనయందు తగిన పదముల ద్వారా భావమును పఠితల హృదయమునకు హత్తుకొనునట్లు చెప్పు శిల్పము కలవు. వారిలో యితరశిల్పములు లేక పోలేదు; ఇవి ప్రాధాన్యము వహించును. నన్నయ నలచరిత్ర, తిక్కన కీచకవధ, పోతన ప్రహ్లాదచరిత్ర యిందు ఉదాహరణములు.

**డా. సి. నారాయణరెడ్డి :**

పాలరాయి అందమైందే; అది తాజ్‌మహల్‌గా రూపొందినప్పుడు. పదాలు పాలరాళ్ళలాంటివి. అవి అందంగా, పొందికగా అమరితే రూపొందే కవిత తాజ్ మహల్ లాంటిది. శిల్పమంటే ఇదే అనుకుంటాను.

**గుంటూరు శేషేంద్రశర్మ :**

కవిత్వంలో మనం శిల్పం అనే దాన్ని యింగ్లీషులో "Form" అనిగానీ, "CRAFT" అనిగానీ అంటారు. కవిత్వపు ఉపరి రూపాన్ని మాత్రమే పరిశీలించి ఆ లక్షణాల్ని వర్ణించేటప్పుడు శిల్పమని సౌకర్యంకోసం వాడవచ్చు. కానీ ఆ చమత్కార జనక ఉపరిస్వరూపం కవిత్వ జన్మతో ముడిపడివున్న వస్తువు. కనక, శిల్పపరిశీలన బహిః పరిశీలన మాత్రమే అవుతుంది. "రాత్రి పిండారబోసినట్లు వెన్నెల కాస్తోంది" అనే సాధారణ అకవిత్వవాక్యం - కవిత్వంలో—

"రాత్రి నగ్నంగా వెన్నెట్లో స్నానం చేస్తోంది" అన్న రూపాన్ని ధరిస్తుంది. రాత్రి-పండు వెన్నెల అనే వాస్తవాలను అధిగమించి, రాత్రి-నగ్నం-స్నానం చెయ్యటం—ఇత్యాది భౌతికాతీత వ్యవహారం ద్రష్టృత్వ మూలకం. ఇది శబ్దాలతో కవి పన్నుతున్న వ్యూహంకాదు - శిల్పమన్న శబ్దంలో ఇలా బుద్ధిపూర్వక వ్యూహ కల్పన అనే అర్థంవస్తుంది; ఆ అర్థం తప్పు.

**మహీధర రామమోహనరావు :**

అన్నింటికన్న శిల్పానికి అతిముఖ్య లక్షణం చదివించగలగడం. తర్వాత ఆలోచనకు అవకాశం ఇవ్వడం. చివరకు బాధో, ఉల్లాసమో, నవ్వో, చిరునవ్వో కోపమో, తాపమో (రచయిత మీదకాదు) కలిగించటం. చదివించగల శక్తి లేకపోతే మిగతావానికి తావే వుండదు. ఈ శక్తి కూడా దేశ, కాల, పాత్రానుబద్ధమేనని మరువకూడదు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

'శిల్ప' మనగా రచనలో చమత్కారం అని అర్థం. శిలకు రూపురేఖలు దిద్ది ఆకారముగ మలచినపుడెట్లు ఆనందము కల్గునో అట్లే రచనా చమత్కారంతో చెప్పదలచిన విషయానికి అందం కల్పించడమే కవితాశిల్పం అవుతుంది. 'శిల్ప' పదం శిలకు సంబంధించినదే అయినా లక్షణార్థముగా, కవితా చమత్కృతి పదంగా వాడబడుతోంది.

12. ప్రజాకవిత్వమంటే మీ దృష్టిలో ఏమిటి ? ఇటీవలి వారిలో ప్రజాకవులుగా మీరెవరినైనా పరిగణిస్తారా ? ఎందుకు ?

డా. సి. నారాయణరెడ్డి :

(సామాన్య) ప్రజల గురించి, ప్రజలకోసం, ప్రజలకు అర్థమయ్యేటట్టుగా ప్రజలను పలికించేటట్టుగా రాసిన కవిత్వం ప్రజాకవిత్వం. ఈ లక్షణాలన్నీ ఉన్నకవి : 'ఎవరో' ఇప్పుడే చెప్పలేను.

ఆరుద్ర :

సమాజంలో వర్గాలు ఏర్పడనప్పుడు సాహిత్యం అందరికీ ఉపయోగించేది. వర్గాలతో బాటు వర్గసాహిత్యం తప్పనిసరి అయింది. ప్రజా సాహిత్యం అశేష ప్రజానీకానికి ఆహ్లాదం, ఉత్తేజం యిస్తుంది.

నా ఉద్దేశంలో సుంకర సత్యనారాయణ, కోగంటి గోపాలకృష్ణయ్య ప్రజాకవులు. లెనిన్ చెప్పినట్లు శ్రామికవర్గం నుంచి శ్రామిక నాయకులు రావాలి. ప్రజల్లోంచే ప్రజాకవి వస్తాడు. చాలామంది విప్లవ కవుల్తోపాటు మనమంతా మధ్య తరగతి కవులమే. ఐతే, మన శ్రామిక పక్షపాతం మన కవిత్వాన్ని అభ్యుదయ కవిత్వం చేస్తుంది.

కుందుర్తి :

ప్రజాకవిత్వం అంటే మనం అనుకునే వ్యుత్పత్తి [గ్రంథ సంబంధమైన] లేకుండానే అట్టడుగు వర్గాలలో నుండి వచ్చి, సహజ ధోరణిలోనే, ప్రజలనాడి తెలుసుకున్నవాడు, వారికి తెలిసేటట్లు రాసిన కవిత్వం. ఇది మొదటి

రకం. అంటే జానపద కవిత్వం అన్నమాట. రెండో రకం - ఖూస్థాయికి దిగి పై వర్గాలవారు ప్రజాదృష్టితో రాసేది. మార్గ కవిత్వం రాసిన కాళోజీ ప్రభృతులను కూడా ప్రజాకవులంటున్నారంటే. వారు జానపద సాహిత్య సరళికి చాలా దగ్గరగా పోవటానికి ప్రయత్నిస్తున్నారని అర్థం.

సుంకర, వాసిరెడ్డి, గద్దర్ ప్రభృతులు ప్రజాకవులు. ప్రజాకవుల ప్రధాన లక్షణం వారు పుస్తకాలు ప్రకటించి వూరుకోరు; ప్రజల దగ్గిరకు వెళ్ళి కవిత్వం వినిపిస్తారు.

శ్రీ శ్రీ :

కవిత్వం ఒక భోగవస్తువుగా కాక ఉపయోగవస్తువుగా మారినప్పుడే దాన్ని ప్రజాకవిత్వం అంటాను. ఈనాడు జానపద ధోరణులలో గీతాలురాసి వాటిని ప్రజలముందు గానం చేస్తున్న గద్దర్, వంగపండువంటివారు ప్రజాకవులంటాను. ఎందుకంటే వారికి లభిస్తున్న ప్రజాదరణ నేను కళ్లారా చూశాను కాబట్టి.

గుంటూరు శేషేంద్రశర్మ :

కవులన్న వాళ్ళ నెరుగుదును కానీ ప్రజాకవులనబడే వాళ్ళను ఎరగను. ఈ ప్రశ్నకు సమాధానం 'ప్రజాకవి' బిరుదున్నవాళ్ళు మాత్రమే చెప్పగల్గుతారు. క్షమించండి.

డా. దాశరథి :

ప్రజా సమస్యలను తీసుకుని రాసేదే ప్రజాకవిత్వం. పేర్లు చెప్పడంలో చిక్కుంది.

డా. దివాకర్ల వేంకటావధాని :

ప్రజల కర్థమగునట్లు సులభమైన భాషలో, ప్రజల శ్రేయస్సును దృష్టిలో నుంచుకుని, ఆనందకరముగా చెప్పు కవిత్వము ప్రజాకవిత్వము. వేమన వంటి వారిని ప్రజాకవులని నే నను కొందును

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

ప్రజా సమస్యలను ఎత్తిచూపి, ఆ సమస్యలలోని ఔన్నత్యాన్ని ప్రజలు తెలిసికొనేటట్లు చేసే కవిత్వం ప్రజాకవిత్వ మనిపించు కుంటుంది. ప్రతిపె ప్రజలకు సంబంధించినదే అయినా రాజకీయ ప్రజాసమస్యలకే ప్రజా కవిత్వం అంకితమై కన్పిస్తోంది. సాంప్రదాయ కవిత్వం వ్రాసిన కవులలో 'రాష్ట్రగానము' వ్రాసిన తుమ్మల ప్రజాకవియని చెప్పవచ్చును. రాష్ట్రం ఇంకా ఏర్పడని కాలంలో ప్రజలకు రాష్ట్రవాంఛ రేకెత్తించడంలో ఇతని రాష్ట్ర గాన కావ్యం సఫలీకృతమైంది. గేయ కవులలో నేడు శ్రీ శ్రీ కమ్యూనిజాన్ని ప్రజలలో వ్యాప్తి చేయడంలో అతని మహాప్రస్థానం చరితార్థమైంది.

12. (A) భావ, అభ్యుదయ, విప్లవ కవిత్వాలకోవకు చెందని శ్రీజాషువా, శ్రీ దువ్వూరి వంటి వారి స్థానాలేమిటి ?

డా. దివాకర్ల వేంకటావధాని :

జాషువా, దువ్వూరి మంచి కవిత్వమును వ్రాసిరి. రసానంద జనకత్వము వారి కవిత్వములలో కలదు. ఏదోకోవకు చెందక పోయిననూ వారు గొప్ప కవులే !

డా. దాశరథి :

జాషువా, దువ్వూరి – వీరి స్థానాల్ని గూర్చి నేను చెప్పాలా ? లబ్ధ ప్రతిష్ఠులు. ఆధునిక సాహిత్యాకాశంలో ధ్రువ తారలు.

గుంటూరు శేషేంద్రశర్మ :

విప్లవం అంటే – విప్లవానికి వర్తమాన సామాజిక వ్యవస్థని ధ్వంసం చెయ్యటం అర్థం. అయితే – జాషువా, ప్రభృతుల్ని విప్లవ కవులు అనలేం. దువ్వూరి, జాషువాలు భావ కవిత్వ మార్గానికి చెందినవారని నా అభిప్రాయం.

శ్రీ శ్రీ :

వీరిని పూర్తిగా భావకవులే అని అనలేను కాని భావ కవితా ప్రభావం వీరి మీద బలంగానే వుంది. అందుచేత వీరిని భావకవుల కోవలో చేర్చాలి.

కుందుర్తి :

జాషువా అభ్యుదయ కవిత్వం పుట్టకముందే పుట్టిన అభ్యుదయకవి. దువ్వూరిలో కూడా ఆ అంశ కొంతవరకు వుంది. అభ్యుదయ కవిత్వం రాయడానికి అభ్యుదయోద్యమం పుట్టవలసిన అవసరం లేదు వేమన రాసింది అదే. ప్రజా దృష్టితో రాయడం ముఖ్యం.

ఆరుద్ర :

శ్రీ జాషువా, దువ్వూరి – మంచి కవులు. జాషువాది సజీవ కవిత్వం. దువ్వూరిది గ్రామీణ రామణీయకం. మీ రడగలేదు గానీ యీ కోవకు చెందిన మరో గొప్పకవి నాయని సుబ్బారావు. భావ కవిత్వపు రోజుల్లో కూడా ఆయనది విలక్షణమైన కవిత్వం.

డా. సి. నారాయణరెడ్డి :

భావ కవిత్వంలోని సంఘసంస్కరణ కవిత్వశాఖకి చెందిన కవి జాషువా. భావ కవిత్వంలోని అన్నిశాఖలకు చెందిన కవి దువ్వూరి రామిరెడ్డి· వారి స్థానాలకేం ? అగ్రంగా, భద్రంగా ఉన్నాయి.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

జాషువా, రామిరెడ్డి భావకవుల కోవకు చెందనివారు కారు. వారి కవిత్వం భావోద్రేకాన్ని ఆకట్టుకొనే ఉంది. వారిని భావకవులుగానే పరిగణింపవచ్చు· కాన వారి స్థానం భావ కవిత్వానికి చెందుతుంది. చిన్న చిన్న శీర్షికలతో ఖండికలు వ్రాసిన వారిని భావ కవులుగా పేర్కొనడం జరిగినందువల్ల వీరిని ఆకోవకు జమకట్టడం జరగలేదు. భావోద్రేకాన్ని కలిగించేదే భావ కవిత్వమనుకుంటే వీరి అఖండ కవిత్వం భావ కవితాస్థానాన్నే ఆక్రమించుకుని ఉంటుంది.

12. (B) 'కృష్ణపక్షం' భావ కవిత్వమైతే–'గబ్బిలం' ఏమిటి ?

డా. సి. నారాయణరెడ్డి :

'గబ్బిలం' సంఘ సంస్కరణ కవిత్వానికి పతాక !

కుందుర్తి :

గబ్బిలం నికార్సయిన అభ్యుదయ కవిత్వం. ఛందస్సులో వున్నందువల్ల దోషమేమీ లేదు.

శ్రీ శ్రీ :

'కృష్ణపక్షం' - సవర్ణుడైతే, 'గబ్బిలం' - హరిజనుడు.

గుంటూరు శేషేంద్రశర్మ :

కృష్ణపక్షం, గబ్బిలం - రెండూ భావ కవిత్వపు కావ్యాలే. కించిత్ వ్యత్యాసం వున్నంత మాత్రాన ప్రధాన భావ కవిత్వపు ఆ యుగీన స్వర్శని అవి ప్రచ్ఛన్నం చేయలేవు.

డా. దాశరథి:

కృష్ణపక్షంలో భావ కవిత్వం ఉంది. గబ్బిలం భావ కవిత్వంలోకిరాదు. అది నియోక్లాసిసిస్ రచన. అనగా ప్రాచీన సంప్రదాయంలో రచించిన ఆధునిక రచన. విషయం ఆధునికం, రూపం ప్రాచీనం - అంటే ఛందోబద్ధమై, సలక్షణ మైన పద్యాలు అందులో ఉన్నాయి. కృష్ణపక్షంలో అర్థం అయినదాని కన్నా, అర్థం కాకుండావున్న దెక్కువ. అది భావకవిత్వ లక్షణం.'గబ్బిలం' అలాకాదు.

డా. దివాకర్ల వేంకటావధాని :

గబ్బిలము కాళిదాసు మేఘసందేశమును దృష్టిలో నుంచుకొని ఆత్మాశ్రయ భావములతో చెప్పబడిన గొప్ప కావ్యము.

ఆరుద్ర :

'కృష్ణపక్షం'-వెలుగులో ఉన్నవాడు చీకటి వరించే విడ్డూరం; 'గబ్బిలం' చీకట్లో బ్రతకవలసింది వెలుగుకై పాకులాడే అభ్యుదయం.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

గబ్బిలం వ్యంగ్య కవిత్వంలోనికి వస్తుంది.

13. ఆధునిక తెలుగు కవిత్వానికి మార్గదర్శకులని చెప్పదగ్గవారు మీ దృష్టిలో వున్నారా ? ఉంటే – ఎవరు ? ఎందుకు ?

ఆరుద్ర :

ఆధునిక తెలుగు కవిత్వానికి చాలామంది మార్గదర్శకులున్నారు. ప్రతి దశాబ్దానికి ఒక ప్రముఖుడు నడుంకట్టి దారి చూపుతాడు. వచన కవిత్వానికి ముద్దుకృష్ణ, శిష్ట్లా, నారాయణబాబు రహదారులు వేశారు.

డా. దాశరథి :

గురజాడ, భావంలో, భాషలో, ఛందస్సులో కొత్తదనం తెచ్చాడుకనుక.

శ్రీ శ్రీ :

ఒకే ఒక్క మార్గదర్శి. అతడే గురజాడ. మార్గాన్ని మళ్ళించాడు. 'అది' కాదు 'ఇది' దారి అని చూపించాడు. ఆ దారిని మాలాంటివాళ్ళం మరింత వెడల్పు చేసుకున్నాం.

కుందుర్తి :

ఆధునిక తెలుగు కవిత్వానికి మార్గదర్శకులు గురజాడ, శ్రీ శ్రీ. ఎందుకు అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం ఎందుకు ? తెలిసిందే అందరికీ; పై ప్రశ్నల్లో వచ్చిన విషయమే.

డా. సి. నారాయణరెడ్డి :

"ఉన్నారా ?" ఇదేం ప్రశ్న ? గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, ఇంకా, ఇంకా......ఎందుకా ? కొత్త బాటలు వేసినందుకు.

గుంటూరు శేషేంద్రశర్మ :

గురజాడ, రాయప్రోలు, శ్రీ శ్రీ లు – ఆధునికకవిత్వ మార్గదర్శకు లన టంలో సందేహంలేదు. కారణం నేను వెనక వివరించిన ఆధునిక కాలీన విలువలు, వేషాలు, వాటి విలక్షణత సమగ్రంగా ఈ ముగ్గురు కవుల్లో బహుళ మొదటిసారి సాక్షాత్కరించాయి.

డా. దివాకర్ల వేంకటావధాని :

ఆధునిక కాలమునందలి పూర్వ భాగమునకు మార్గదర్శకులు తిరుపతి వేంకట కవులు. ఉత్తర భాగమునకు మార్గదర్శకుడు శ్రీ శ్రీ. అప్పటి కవులు వారి కవిత్వముచే ప్రభావితులగుటయే యిందుకు కారణము.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారిని చెప్పవచ్చు. ఛందస్సు సాంప్రదాయానికి చెందినదైనా, భాషలో మడికారము జాతీయత వారి కవిత్వంలో ప్రచురంగా ఉండడంవల్ల, భావోద్రేకాన్ని కల్గించే అర్థం గాంభీర్యం ఉండడం వల్ల అది మార్గ దర్శకంగా ఉందని చెప్పవచ్చు.

నార్ల వేంకటేశ్వరరావు :

ఇప్పుడు ఎవరో భావితరం నిర్ణయించాలి. ఐతే ప్రస్తుత కవులమీద శ్రీ శ్రీ ప్రభావం చాలా వుంది — ఐనా **He is one among ten trend-setters.**

14. మీ దృష్టిలో ఆధునిక సాహిత్యంలో పది కాలాలపాటు నిలిచే రచనలేమైనా వున్నాయా ?

(A) మీవి ఏమైనా వున్నాయా ?

(B) లేవంటే - ఇంత సాహిత్య కృషి వ్యర్థమై పోయిం దను కోటానికి ప్రత్యేకమైన కారణాలున్నాయా ?

డా. దివాకర్ల వేంకటావధాని :

శివభారతము. సౌందరనందము, శ్రీ మద్రామాయణ కల్పవృక్షము, ఆంధ్ర పురాణము, మహాప్రస్థానము - మొదలగునవి పది కాలములపాటు నిలుచుట కవకాశము కలదు.

(a) నా వేమియు లేవు.

(b) స్వతంత్రములైన భావములు లేక పోవుటయే కారణము.

గుంటూరు శేషేంద్రశర్మ :

అపార్థానికి గురికాకుండా దీనికి సమాధానం చెప్పటం కష్టం. ఏ ఒక్క కవిని గురించికూడా యీ విషయంమీద తనఅభిప్రాయం తెల్పటంకంటె, కవిత్వ మంటే ఏమిటో క్షుణ్ణమైన జ్ఞానం గడించుకొని, దానితో ఎవడికివాడై అంచనా వేసుకోవటం వివేక పద్ధతి

[a] అది కూడా ఈ పద్ధతి ప్రకారం నిర్ణయించుకోవాలి.

[b] సాధారణంగా తెలుగు కవిత్వం, అన్ని భాషల కవిత్వాలతో పోల్చిచూస్తే ఈ ఆధునిక కాలంవరకు — 'కవిత్వం' అన్న పదానికి ఎంతో దూరం పడుతుంది. ఈ వాస్తవ స్థితిని గమనించినప్పుడు, ఇందులో ఎంత నిలుస్తుందో, ఎంత పోతుందో చెప్పటం దుస్సాధ్యం.

డా. సి. నారాయణరెడ్డి :

ఆ మధ్య నోరి నరసింహశాస్త్రిగారు ఈ విషయంలో సీరియల్‌గా రాశారు. ఆ జాతకాల జోలికి నేనుపోను అయితే-మంచి రచన కాలాని కెదురీది నిలుస్తుం దనే ఆశావాదని నేను.

[a] అది నేనుకాదు చెప్పేది - రానున్న తరాలు.

[b] దీనికి సమాధానం అవసరం లేదనుకుంటాను.

కుందుర్తి :

పది కాలాలపాటు నిలవడం అంటే ఏమిటో ముందు తేల్చుకోవాలి. రచనలు రెండు విధాలుగా నిలుస్తాయి అసలు ప్రజల్లోకి వెళ్ళకుండా సాహిత్య వర్గాల్లో మాత్రమే నిలవడం ఒకటి. సాహిత్య వర్గాలద్వారా ప్రజల వరకు వెళ్ళి నిలవడం రెండవది. రామాయణ, భారతాల వంటి Apics తప్ప మిగిలినవేవీ ప్రజల్లోకి వెళ్ళి నిలవలేదు. వేమన వంటి ప్రజాకవులు రాసిన కవితలుకూడా అక్కడిదాకా ప్రాకి నిలిచాయి.

సాహిత్య వర్గాల్లో మాత్రమే నిలిచేవి అనే అర్థంలోనైతే మహాప్రస్థానం నిలుస్తుంది. ఈ విషయంలో నేను ఛందోబద్ధ కవిత్వాన్ని విడిగావుంచి యీ మాట చెప్తున్నాను

[a] నా వేమైనా నిలుస్తాయేమో మీరే చెప్పండి

[b] ఏ సాహిత్య కృషి వృధాకాదు. నిలిచే కావ్యాలు వస్తాయియింకా.

శ్రీ శ్రీ :

ఉన్నాయి ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని నావి కూడా. లేవనటంలేదు కాబట్టి నేటి సాహిత్య కృషి వ్యర్థ మయ్యిందనటానికి కారణాల్లేవు.

నా మహాప్రస్థానంలో, ఖడ్గసృష్టిలో, మరో ప్రస్థానంలో పదికాలాలపాటు మాత్రమేకాదు [ఆ చంద్ర తారార్కంగా అననుకాని] తెలుగు భాష వున్నంత కాలం నిలిచే కవిత్వం వుందని నా గట్టి నమ్మకం. రాశిలో తక్కువే, అయినా గురజాడ కవిత్వం సమస్తం నిలుస్తుంది. కవికొండల, బసవరాజు అప్పారావు, నండూరి—ఈ జాబితా యింతటితో పూర్తయ్యేది కాదు.

డా. దాశరథి :

కన్యాశుల్కం, మాలపల్లి వేయిపడగలు, చివరకు మిగిలేది, అసమర్థుని జీవయాత్ర, గబ్బిలం, కృష్ణపక్షం వగైరా.

[a] నా రచనలు పది కాలాలపాటు నిలుస్తాయో, లేదో కాలమే నిర్ణయిస్తుంది.

ఆరుద్ర :

తప్పకుండా వుంటాయి. పది కాలాలు పోయాక అనాటి వాళ్ళే యీ ప్రశ్నకి సమాధానం చెబుతారు. నా త్వమేవాహాన్ని రాబోయే తరాల సాహిత్య విద్యార్థులు చదువుకుంటారు.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

మహాప్రస్థానం, కృష్ణపక్షం. ఉదయశ్రీ వంటివి పది కాలాలపాటు నిలిచేవే.

[a] మావి లేవని మేము ఎలా అంటాము ?

[b] లేవని చెప్పలేదుగా !

15. మీరు కవిత్వం రాయటం ప్రారంభించిన నాటినుండి నేటి వరకు చూస్తే ఎన్నో మార్పులువచ్చాయి. మీ రిప్పుడే కవిత్వ రచన ప్రారంభించే దశలో వున్నట్లయితే మీ రెటువంటి కవిత్వం రాస్తారు ?

డా. దాశరథి :

వచన కవిత వ్రాస్తాను.

ఆరుద్ర :

నే నిప్పుడే కవిత్వం ప్రారంభించే దశలో వుంటే నిన్నటి దిగంబర కవుల్ని ఇమిటేట్ చేస్తూ రచనలు మొదలెడతానేమో ! నేను కలం పట్టిన తొలి రోజుల్లో శ్రీ శ్రీ ని ఇమిటేట్ చెయ్యటం మానేసి పటాఫ్ ప్రభావంలో పడేదాకా శ్రీ శ్రీ యే నన్ను గుర్తించలేదు.

శ్రీ శ్రీ :

లేని వారి భాషలో జానపద రూపాలలో కవిత్వం రాస్తాను.

డా. సి. నారాయణరెడ్డి :

ఇప్పుడు కొత్తగొంతును పదునుగా పలికిస్తున్న కవి ఏం రాస్తున్నాడో? ఎలా రాస్తున్నాడో ? నేనూ అదే రాసేవాణ్ని. అలాగే రాసేవాణ్ణి.

కుందుర్తి :

ఇప్పుడే కవిత్వం రాసే దశలో వుంటే కూడా నేను యిప్పటిలాగే అభ్యుదయ కవిత్వం రాసేవాణ్ని. అభ్యుదయ, విప్లవ కవిత్వాలమధ్య నేను భేదం పాటించడం లేదు.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఈ ప్రశ్నకి సమాధానం వెనకటి సమాధానాల్లో వెతుక్కోమని మనవి.

డా. దివాకర్ల వేంకటావధాని :

నాకు మొదటి నుండియు సంప్రదాయ కవిత్వముపైనే అభిమానము హెచ్చు. ఆధునిక కవిత్వముమీద ప్రీతి లేకపోలేదు. కాని నేను మాత్రము సంప్రదాయ పద్ధతిలోనే వ్రాయుదును. ఇప్పుడైనను అట్లే వ్రాయుదును.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

ద్విపదల్లాంటి ఛందస్సుతో, వ్యంగ్య ధోరణిలో ప్రజామనస్సును ఆకట్టుకొనేటట్లు వ్రాస్తాము.

15. (A) మీ సాహిత్య జీవితంలో మరపురాని సంఘటనలు ఉంటే చెప్పండి.

డా. దివాకర్ల వేంకటావధాని :

ఒకప్పుడు నన్ను మిత్రులొకరు జయపూర విక్రమ దేవవర్మ మహారాజు వద్దకు తీసుకొనివెళ్ళిరి. నన్నుగూర్చి ప్రశంసాపూర్వకంగా కొన్ని మాటలు చెప్పిరి. ఇది 45 ఏండ్ల క్రిందటిమాట ! వారప్పుడు పండితులకుగాని, కవులకు గాని గర్వ మెందుకుండవలెను ? గర్వము పొందుటకు తగిన కవిత్వముగాని, పాండిత్యముగాని ఎవరి కుండును ? అని పలికిరి. అప్పుడు బాణుని వృత్తాంత మును గ్రహించి 'రాజ సందర్శనము' అను కావ్యమును జెప్పితిని. వారి మాట లిప్పటికిని నాకు నిత్యస్మృతిలో నుండును.

గుంటూరు శేషేంద్రశర్మ :

నా సాహిత్య జీవితంలో ఘన విజయాలుగాని, మరపురాని సంఘటనలు గాని ఏమీ లేవు

కుందుర్తి :

నా కిప్పుడు మరపు ఎక్కువవుతున్నది. ఇప్పటి వరకు గుర్తున్నవన్నీ మరపురాని సంఘటనలే.

ప్రత్యేకంగా చెప్పాలంటే 'కుందుర్తి కృతులు' ప్రచురణ. ఇంత పేద కవికి అటువంటి అవకాశం వస్తుందని నేను కలలోకూడా ఊహించలేదు.

డా. దాశరథి :

నాటి హైదరాబాదు సంస్థానంలో పోలీసు చర్యకుముందు ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి వార్షికోత్సవాలలో పాల్గొనడం, కవితా గోష్ఠులు జరపడం, జైల్లో వ్రాసుకోడానికి కాగితం లేకుంటే మిత్రులకు కవితలు వినిపించి, నేను మరిచిపోతే వారు నాకు జ్ఞాపకం చేయగా మళ్ళీ వ్రాసుకోవడం.

ఆరుద్ర :

నా సాహిత్య జీవితంలో మరపురాని సంఘటనలు లేకపోలేదు. ఐతే గియితే - నేను ఆత్మకథరాస్తే అందులో చెప్పవల్సిందే కాని యిక్కడ కాదు.

డా. సి. నారాయణరెడ్డి :

ముప్పయ్యేళ్ళ నా సాహిత్య జీవితంలో మరపురాని సంఘటన-నిట్టూర్పు లేకుండా, నిలిచిపోకుండా నిరంతరం రచన సాగించడమే.

శ్రీ శ్రీ :

ఒకటి :- 'మహాప్రస్థానం' గీతాన్ని 'భారతి' మాస పత్రిక తిరగ్గొట్టటం.

రెండు :- "కవితా ! ఓ కవితా !" అనే గీతం చదువుతూ వుంటే విశ్వనాథ సత్యనారాయణగారు అశ్రుసిక్త నేత్రులు కావటం (కంటి తడి పెట్టుకోవడం)

మూడు :- 1970 లో (నా షష్టిపూర్తి సంవత్సరంలో) వి. ర. సం. ఆవిర్భావం!

డా వేదుల సూర్యనారాయణశర్మ :

నా 'లక్ష్మీ సహస్ర' కావ్యాన్ని ప్రభుత్వ ఆస్థాన కవులు వెళ్ళపిళ్ళవారు, శ్రీపాదవారు, కాశీ కృష్ణాచార్యులుగారు, విశ్వనాథవారు కొనియాడి "సరస్వతీ కంఠాభరణ" బిరుదము సమర్పించిన సంఘటన నా సాహిత్య జీవితంలో మరపురానిది.

నార్ల వేంకటేశ్వరరావు :

నేను గ్రామీణ జీవితానికి సంబంధించిన ఏకాంకిక నాటకాలు (భంగపాటు, ప్రారబ్ధం, శకునపక్షివంటివి) రాశాను. వాటిని గ్రామీణ భాషలో, నుడికారంలో రాయటానికి ప్రయత్నించాను. వాటిలో మూడు నాటికలు మద్రాసులో 1945 లో ప్రదర్శించారు. టిక్కెట్లు లేకుండా రెండు మూడొందల మంది పెద్దల్ని ఆహ్వానించటంజరిగింది. తర్వాత రెండు,మూడు రోజులపాటు మద్రాసులో యీ నాటికల ప్రదర్శనమాటే ఎక్కువగా వినబడింది. వీటి విజయాన్ని చూసిన మిత్రులు తెనాలిలో ప్రదర్శించారు. అక్కడికి నన్ను ఆహ్వానించారు. అక్కడ అవి మిజరబుల్ ఫెల్యూరయ్యాయి. తెనాలిలో అప్పుడుంటున్న గోపీచంద్ తన యింటి దగ్గర నాకు తేనీటి విందు చేశాడు. అప్పట్లో తెనాలిలో ఒక రాయిస్ట్ అనుచరుడు హోటల్ నడుపుతూవుండేవాడు. ఆయన యీ విందుకు పదార్థాలు సప్లయి చేసి ఆయనావచ్చి మాట్లాడుతూ "కొంతమంది గ్రామస్థులు నాటకాలుచూసి హోటల్కొవచ్చి మిమ్మల్ని పడతిట్టా" రని చెప్పాడు ఏమని తిట్టారో వివరించమని అడి

గాను. "ఏమిటో కొత్త నాటకలు రాశాడన్నారు. వాడి తలకాయ - కొత్తదన మేముంది ? మనం మఱ్ఱి చెట్టుకింద కూర్చుని మాట్లాడు కున్నట్టుం" దని తిట్టారని చెప్పాడు. "అది దూషించటంకాదు; నేను ఆశించనంతటి గొప్ప ప్రశంస" అని నేనన్నాను. ఇది నేను మర్చిపోలేని సంఘటనల్లో ఒకటి

15. (B) మీ రచన వెనుకనున్న ప్రభావాలేమిటో చెప్తారా ?

డా. సి. నారాయణరెడ్డి :

నా రచన పైన భిన్న భిన్న ప్రభావాలున్నాయి. నా కవిత ఒకే మూసలో పోసి తీసినవి కావు. అర పేజి దాటని చిరు కవితలున్నాయి. ఆశ్వాస విభక్తంగా రాసిన 'కర్పూర వసంతరాయలు' లాంటి పెద్ద కావ్యాలూ ఉన్నాయి. అప్పుడప్పుడూ రాసి పత్రికల్లో ప్రచురించిన కవితలు నాలోనో, నా చుట్టూ వున్న సమాజంలోనో. ఏర్పడిన సంఘర్షణలతోనో, సంఘటనలతోనో పుట్టుకొచ్చినవి. 'నాగార్జున సాగరం' లాంటి కావ్యాలు-గేయ చ్ఛందస్సులో సమగ్రమైన కావ్య నిర్మాణం చెయ్యాలనే సంకల్పంతో రచించినవి.

ఆరుద్ర :

స్వాతంత్ర్యోద్యమం, సామ్యవాదం. నా రచనల వెనుకనున్న ప్రభావాలు.

డా. దాశరథి :

నా రచన వెనుక ఉన్న ప్రభావం ప్రజల ఉద్యమాలే.

కుందుర్తి :

మార్క్సిస్టు భావనారీతి నా రచనలకు ప్రాణం.

గుంటూరు శేషేంద్రశర్మ :

నా జీవితంలో నేను అనుభవించిన అన్యాయాలు, పొందిన పరాజయాలు, అవమానాలు నా రచనల వెనుకనున్న ప్రధాన సామగ్రి.

నా కవిత్వమంతా నా కష్ట సుఖాల్లోనించి పుట్టిందే. మా నాన్న గ్రామం మునసబ్‌గా వుండేవాడు. నేను ఆయన నడుముల ఎత్తు బాలుణ్నిగా వున్నప్పుడు

ఆయన చూపుడువ్రేలు నా చేత్తో పుచ్చుకుని, చిన్న నిక్కరు, చొక్కా వేసుకున్న నేను తాలూకాఫీసుకు వెళ్ళాను. శిస్తు వసూలు బాగా చేయలేదని మా నాన్నను ఆ తాసీల్దారు మహా ఘోరంగా, ఎంతో సేపు తిట్టాడు. భరించలేక నేను ఏడ్చాను. "Get Out" అన్న తాసీల్దారు అరుపుతో మా నాన్న నన్ను తీసుకుని బయటకివచ్చాడు ఆ దృశ్యం నా జీవయాత్ర ముగిసే వరకు నా కళ్ళలో దేవాలయం కట్టుకుని ప్రతిష్ఠ అయి వుంటుంది. అంత లోతునవుంది నా క్రోధాగ్నికి మూలం; నా ఉగ్రకవితకు పునాది. అప్పటి నుంచే ఆఫీసరంటే నిర్దాక్షిణ్యంగా వేటాడి చంపబడవలసిన క్రూర జంతువనే భావం నా చైతన్యంలో ఒక భాగం అయిపోయింది. నేను అధికారానికి శాశ్వత శత్రువుని.

డా. దివాకర్ల వేంకటావధాని :

మా పినతండ్రి దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు. నన్ను ఆయనవంటి విద్వత్కవిని చేయవలెనని మా నాయన గారి అభిప్రాయము. అప్పటి నుండియు తిరుపతి వెంకటకవుల రచనలన్నియు చదివితిని. తదువాత విశ్వనాథ సత్యనారాయణగారి యింటిలో నుండి చదువుకొనుట సంభవించినది. పూర్వ కవుల గ్రంథములన్నియు చదివితిని. నన్నయ, శ్రీనాథుడు, పెద్దన, సత్యనారాయణ గారు మున్నగువారివలె నేను వ్రాయలేక పోయినను, అట్లు వ్రాయవలెనని నా అభిలాష.

శ్రీ శ్రీ :

1930 లో ప్రపంచవ్యాప్తమైన ఆర్థిక మాంద్యం, ఆ దశాబ్దంలోని స్పెయిన్ అంతర్యుద్ధం—మొత్తంమీద నా జీవితం చుట్టూ పరిభ్రమిస్తున్న అనేకానేక జీవితావేశాలూ, ఆవర్తాలూ.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

అనువాద కవిత్వంలో—సుగమంగా స్వతంత్రము అని అనిపించే విధంగా వ్రాయడం, కల్పనా కవిత్వంలో—సూటిగా అందేటట్టు సాంప్రదాయక శైలిలో వ్రాయడం, పరిశోధనలో – పరిష్కారంకాని జటిల విషయాల్ని హేతుబద్ధంగా, అన్ని వాదాలకు సరిపడే విధంగా పరిశోధించడం, విమర్శనలో – కవి హృదయాన్ని అతని మాటలలోని వ్యుత్పత్త్యర్థ ప్రదర్శనలతో నిరూపించడం.

16. ఈ 30 ఏళ్ళనుండి ప్రభుత్వంగానీ, ప్రభుత్వం ఏర్పాటు చేసిన సంస్థలుగాని, వాటి దృష్టిలో ఉత్తమ రచన లనిపించిన వాటికి బహుమతు లిస్తున్నాయి.

ఈ విధానం బాగుందా? ఉత్తమ రచన ఎన్నికకు మీరు సూచించే విధానం ఏదైనా వుందా?

డా. దాశరథి:

ప్రభుత్వం, ప్రభుత్వేతర సంస్థలు బహుమతులు ఇస్తున్నందుకు సంతోషిస్తున్నాను. ఏలాటి నిష్పాక్షిక పద్ధతిలో బహుమతి ఇచ్చినా విమర్శ ఉంటూనే వుంటుంది. ఎక్కువమంది అభిప్రాయాలు సేకరించి నిష్పాక్షికంగా ఒక నిర్ణయానికి రావడమే సరియైన పద్ధతి.

డా. సి. నారాయణరెడ్డి:

అసలు ఉత్తమ రచనలకు బహుమతు లివ్వాలా? ఇస్తేనే ఉత్తమ రచనలా? ఆ పరిధిలోకి రాక ఎక్కడెక్కడో పడివున్న మంచి రచనల మాటేమిటి? ఈ ప్రశ్నలను అలావుంచి చూస్తే సాహిత్య అకాడమీ వంటి సంస్థలు బహుమతులివ్వటానికి ఎన్నుకొన్న విధానం బాగానేవుంది. లోపాలకేం? అంతటా వున్నాయి. ఈ విధానంలోనూ వుండొచ్చు. ఎప్పటి కప్పుడు సవరించుకుంటూ పోతే, ఇది సత్ఫలితాల నివ్వొచ్చు.

శ్రీ శ్రీ:

బహుమతులు, బిరుదులు ధన స్వామ్య వ్యవస్థ లక్షణాలు. సామ్యవాద వ్యవస్థలో ఒక కవి తన రచనలతోనే జీవించగలడు. బిరుదప్రదానా లింకా రష్యాలో వున్నాయిగానీ నాకు తెలిసిన నంతమటుకు చైనాలో లేవు. మన వ్యవస్థలో యీ బహుమతులకి, బిరుదులకి రాజకీయ ప్రాపకాలు ముఖ్యం. బహుశా, ఇప్పటి పరిస్థితుల్లో యివి తప్పవేమో!

సాహిత్య అకాడమీ వంటి సంస్థలు పునర్ వ్యవస్థీకరణ (ఫ్రెంచి అకాడమీ బాణీలో) జరగాలి. ఉత్తమ రచనలను రచయితలే నిర్దేశించాలి. యువ రచయితలకు వీలైనంత ఎక్కువగా ప్రోత్సాహం ఇవ్వాలి.

కుందుర్తి :

సాహిత్యానికి బహుమతులుయిచ్చేవిధానం వుంచేఉండనీయండి.కొందరైనా లాభపడతారు. ప్రోత్సాహం లభిస్తుంది. నష్టమేమీలేదు. చిక్కు ఎప్పుడు వస్తుందంటే ఫలానా రకం కవులు బహుమతులకు అర్హులుకారు అని ప్రకటిస్తే. పైకి ప్రకటించకుండా లోపల లోపల అటువంటి అభిప్రాయాలు పెట్టుకుని ప్రవర్తిస్తే వారికి ప్రజాభిప్రాయం వ్యతిరేకంగా వస్తుంది.

ఉత్తమ రచన ఎన్నికకు ఏ విధానం అనుసరించినా లోపాలు వుండనే వుంటాయి. Perfect విధానం ఎవరూ చెప్పలేరు.

గుంటూరు శేషేంద్రశర్మ :

కేవలం ఆశ్రితులకే అవార్డులు ఇస్తున్నారు-అన్న సంగతి జగద్విదితం. దీనికి ఏ పద్ధతులు అవలంబించినా, చివరికి జరిగేది యిదే కనక ఆ పద్ధతుల గుణ దోష విమర్శ వర్తమాన తెలుగు సాహిత్యంలో అప్రస్తుతం అవుతుంది.

ఆరుద్ర :

ఇస్తున్న బహుమతులు ఉత్తమ రచనలకు కాదు, కొన్ని సందర్భాల్లో ఉత్తమ రచయితకు, విశ్వనాథ సత్యనారాయణగారి మధ్యాక్కర్లకు సాహిత్య అకాడమీ బహుమతి యిచ్చింది. దాని కన్నా చాలా మంచి రచనలు ఆయన వేరే చేశారు. అలాగే కుటుంబరావుగారి 'తార' కు బహుమతి యిచ్చారు. అది ఆయన రాసినట్టుకూడా చాలా మందికి తెలియదు.

ఉత్తమ రచనల ఎన్నికకు ఇప్పుడనుసరిస్తున్న విధానాలు సరియైనవికావు.

ఎవరో కొంతమంది సభ్యుల్ని కొన్ని అర్హమైన పుస్తకాల పేర్లు చెప్పమనటం, ఆ పేర్లలో ఏదో ఒక దానికి బహుమానం ఇవ్వటం శాస్త్రీయమైన పద్ధతికాదు. ఆయా సంవత్సరాల్లో వెలువడిన పుస్తకాల పూర్తి జాబితానుకూడా ఈ సంస్థలు తయారు చేసే స్థితిలో లేవు.

డా. దివాకర్ల వేంకటావధాని :

ప్రస్తుత విధానములో కొన్ని ఉత్తమ రచనలు అసూచితములుగా ఉండిపోవుచున్నవి. రచయితలు అర్హములైన తమ రచనములను స్వయముగా బహు

మతులకై పంపవచ్చునని ప్రకటన చేయవచ్చును. అప్పుడు అర్హ రచనలు దృష్టికి రాకపోవుట అను లోపముండదు; వ్యక్తిగతాభిమానములకును తావుండదు. అట్లువచ్చిన పుస్తకములనుండి అత్యుత్తమమైన దానినే ఎన్నుకొనవచ్చును.

**మహీధర రామమోహనరావు :**

ఉత్తమ రచన ఎన్నికకు ప్రస్తుతం అకాడమీ అనుసరిస్తున్న పద్ధతి, మన తెలుగు దేశంలోని పరిస్థితుల దృష్ట్యా బాగానే వుందని నా అభిప్రాయం. ఆ సంస్థ పాలకవర్గం ఆలోచనా పద్ధతిలో కొన్ని లోపాలు లేకపోలేదు. కాని, దేశంలోని విద్యావంతులలోని అవ్యవస్థిత స్థితికూడా గణనకు తీసుకోవాలి కదా. కనీసం ఇంతకన్న మరో మంచి పద్ధతి నాకు తట్టలేదు.

**డా. వేదుల సూర్యనారాయణశర్మ :**

ఈ విధానం బాగానేవుంది. కాని నిష్పక్షపాత వైఖరితో నిర్ణయం జరగడం లేదనే అసంతృప్తికూడా ఉంది. ప్రభుత్వం ఒత్తిడి లేకుండా నిర్ణయాలు జరిగినపుడు దానిని మెచ్చుకొనవచ్చు.

17. ఈ క్రింది వ్యక్తుల్ని గురించి మీ అభిప్రాయం ఖచ్చితంగా చెప్పండి.

1. <u>గురజాడ అప్పారావు :—</u>

గుంటూరు శేషేంద్రశర్మ :

గొప్ప ద్రష్ట. ప్రజాశ్రేయోభిలాషి. గొప్ప సాహిత్య స్రష్ట; కానీ కవిత్వం పాళ్ళు చాలా తక్కువ.

**డా. దివాకర్ల వేంకటావధాని :**

గురజాడ అప్పారావుగారిని 'గురజాడ వాల్మీకి' అన్నప్పుడు నాకు నవ్వు వచ్చును.

**కుందుర్తి :**

భవిష్యత్తు ఎలా వుంటుందో ఊహించిన ద్రష్ట.

శ్రీ శ్రీ :

గురజాడ అప్పారావు మీదట చూడండి.

డా. సి. నారాయణరెడ్డి :

ఆధునిక కవిత్వానికి అరుణోదయం లాంటివాడు.

2. దేవులపల్లి కృష్ణశాస్త్రి :—

డా. సి. నారాయణరెడ్డి :

అనుభూతిని అక్షరాలా అందంగా చెక్కిన శిల్పి.

శ్రీ శ్రీ :

కవులన్నా, కవిత్వమన్నా ఎంతో యిష్టం. ఛందస్సు మీద సర్వాధికారి.

కుందుర్తి :

భావ కవితాయుగంలో వచ్చిన శిల్పమూ, రామణీయకత, సౌందర్యము మొదలగు concept కు ఉదాహరణమైనవాడు. శబ్ద శిల్పి. అయితే కవితలోని వియోగ సందేశము నాకు నచ్చదు. దేశానికి అవసరం లేని వృథా సందేశము.

డా. దివాకర్ల వేంకటావధాని :

మృదు మధుర పదములతో ఆత్మాశ్రయ కవిత్వము చెప్పగల భావుకుడైన గొప్పకవి.

గుంటూరు శేషేంద్రశర్మ :

రొమాంటిక్ యుగం దేశంలో రేపిన ఒక సమ్మోహన నాగరికతకి కృష్ణశాస్త్రి ఒక సాహిత్య ప్రతీక.

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

భావకవిత్వం ఎప్పటిదో అయినప్పటికి ఇప్పటికికూడ ఆయన భావములు నవీనములుగానే యుండి సందేశములను వెలువరించుచున్నవి. ఆయన కావ్య

ములు చిరకాలం వర్ధిల్లేవని ఖచ్చితంగా చెప్పవచ్చు. అందలి విషయములు ఏ ఒక్క కాలమునకు చెందినవి కావు కాన వాటికి కాలంతో నాశంరాదు. సాంఘిక ప్రయోజన కరములైన కావ్యములు ఆ కాలముతోనే నశిస్తాయి.

## 3. బాలగంగాధర తిలక్ :—

**డా. దివాకర్ల వేంకటావధాని :**

పీరి కవిత్వము పెక్కుచోట్ల నే నర్థము చేసికొనలేక పోలిని కొన్ని భాగములు మాత్రమే చదివి నే నానందింప గలిగితిని.

**గుంటూరు శేషేంద్రశర్మ :**

తిలక్ నిజమైన కవి. తెలుగు కవులలో, కాలం నోట్లో పడకుండా మిగిలే చంద్రబింబం అనవచ్చు.

**కుందుర్తి :**

భావ కవుల్లో చివరివాడు. కవిత్వపు అభిప్రాయాల్లో కృష్ణశాస్త్రి వంటివాడే.

**శ్రీ శ్రీ :**

మంచి కవి. ఇంకా బతికుంటే యింకా మంచి రచనలు చేసేవాడు.

**డా. సి. నారాయణరెడ్డి :**

అనుభూతి పరిధిలో ఉంటూనే అభ్యుదయ భావుకతను పలికించిన కవి.

**డా. వేదుల సూర్యనారాయణశర్మ :**

అతని గేయకవితలో సంఘ విప్లవాన్ని రేకెత్తించడంవల్ల ఆ విప్లవం ఇప్పటికీ ఆవశ్యకముగా కన్పించుచున్నందువల్ల మరికొంతకాలం తిలక్ కవిత్వం నిలబడ గలదు. గేయ కవిత్వం కంటె అతని కథలు భావ ప్రధానములుగా నుండుటచే చిరకాలం నిలుస్తాయని చెప్పవచ్చు.

## 4. కుందుర్తి :—

**శ్రీ శ్రీ :**

వచన కవిత్వంలో తనదీ అన్న విశిష్టత్వం వున్నవాడు.

**డా. సి. నారాయణరెడ్డి :**

వచన కవిత్వానికి ప్రాచుర్యం కలిగించి, ఆ ప్రక్రియలో సమగ్ర కథా కావ్యం రావాలని వాదిస్తున్న అభ్యుదయ కవి.

**గుంటూరు శేషేంద్రశర్మ :**

అపార కవిత్వ ఉత్సాహంవున్న కర్మిష్ఠి. తెలుగు వచన కవితోద్యమ ప్రవక్త. నిగర్వి. నిరాడంబరజీవి.

**డా. దివాకర్ల వేంకటావధాని :**

వచన కవులలో అగ్రగణ్యుడని నా అభిప్రాయము.

## 5. నారాయణబాబు :—

**డా. దివాకర్ల వేంకటావధాని :**

ఈయన కవిత్వము నేను చదువలేదు,

**గుంటూరు శేషేంద్రశర్మ :**

ఆవేదన వున్న అసలైన కవి.

**కుందుర్తి :**

ఆధునిక కవిత్వంలో కొత్త యిమేజరీని బాగా ప్రవేశపెట్టాడు. ఆధునిక కవిత్రయంలో ఒకడు. మిగిలినవారు శిష్ట్లా, శ్రీ శ్రీ.

**శ్రీ శ్రీ :**

శిష్ట్లా శిష్యుడు, ఆరుద్రకి గురువు.

డా. సి. నారాయణరెడ్డి :

తెలుగుకవిత తిరగలేనన్నిమలుపుల్ని తొలినాళ్ళలోనేతిప్పిన ప్రయోగ శీలి.

6. డా. సి. నారాయణరెడ్డి :—

శ్రీ శ్రీ :

పైకి ఎలా కనిపించినా అంతరాంతరాల్లో భావకవి.

కుందుర్తి :

భావ కవిత్వ చ్ఛాయలున్నాయి. శబ్దం ఏరడంలో నేర్పరి. మాత్రా ఛందస్సులలో కావ్యం నడపిన ఘనత పొందాడు. ఆధునికుడైన పండితకవి.

గుంటూరు శేషేంద్రశర్మ :

కావ్యం యశసే, అర్థ కృతే, వ్యవహార విదే— అనే మూడు ముక్కల్లో ఆయన కవిత్వాన్ని అంతటినీ గురించి చెప్పవచ్చు. వర్తమాన రాజకీయ, సామాజిక శక్తుల బలం చేతిలో సాహిత్య శక్తుల బలం ఎలా పరాజితమౌతుందో సూటిగా చెప్పేప్రతీక ఆయన.

డా. దివాకర్ల వేంకటావధాని :

వీరు మాత్రా ఛందస్సుతో కూడిన గేయ కావ్యములు వ్రాయుట నాకు మిక్కిలి ప్రీతికరము.

7. పఠాభి :—

గుంటూరు శేషేంద్రశర్మ :

ఆయనలో కవిత్వ చమత్కారం వుంది; అనుభూతి ఎత్తులు లేవు.

డా. దివాకర్ల వేంకటావధాని :

వీరి కవిత్వము నెక్కువగా నేను చదువలేదు.

కుందుర్తి :

వచన కవితారంగం ఆద్యులలో ఒకడు.

శ్రీ శ్రీ :

కవితా సంపన్నుడు. రాసింది తక్కువేకానీ వాసిలో ఎక్కువ.

డా. సి. నారాయణరెడ్డి :

ఆయన కవిత్వానికి వైచిత్ర్యమే ఆయుస్సు.

8. డా. దాశరథి :—

డా. సి. నారాయణరెడ్డి :

పద్యం, గేయం, వచన గేయం – మూడింటినీ సమర్థంగా నడిపిన ఆధునిక కవి.

శ్రీ శ్రీ :

లేని ఆస్థానానికి ఉన్న ఒకే అలంకారం. కొత్త కవులలో పాతవాడు.

కుందుర్తి :

ఉద్యమ స్ఫూర్తితో కవిత రాసిన ఆవేశకవి. ఇప్పుడు ప్రభుత్వ పక్షం అయినా మొదట్లో ప్రజల పక్షాన నిలిచినవాడు.

డా. దివాకర్ల వేంకటావధాని :

దాశరథిగారు కొత్త పాతల మేలు కలయికతో కూడిన ఛందోబద్ధమైన మహాకావ్యములు వ్రాసినచో బాగుండునని నే ననుకొనుచున్నాను.

గుంటూరు శేషేంద్రశర్మ :

మనోహర పద్య కవితా శిల్పి. పద్య శిల్ప మయ బ్రహ్మ !

డా. వేదుల సూర్యనారాయణశర్మ :

ఈతనిది గేయ కవితయైనప్పటికీ వచనం సాంప్రదాయ ధోరణిని నడిచి నది. విషయ నిరూపణలో సాంప్రదాయక పద్ధతి, భాషా విషయంలో ఆధునిక పద్ధతి ఈతనిలో కలగలుపుగా కనిపిస్తాయి. ఇటు ప్రాచీన అటు నవీన కవితాభి మానులకు ఇతడు మిత్రుడుగా కన్పిస్తాడు. ఇతని కవిత పది కాలాలపాటు నిల బడేదిగా ఉంటుందని చెప్పవచ్చు.

## 9. విశ్వనాథ సత్యనారాయణ :—

**డా. దివాకర్ల వేంకటావధాని :**

విశ్వనాథవారు పలువురు పూర్వకవుల కవితా గుణములు ఏకత్ర పుంజీభ వించిన మహాకవులు.

**కుందుర్తి :**

ఆధునిక యుగంలోని (కాలవాచకంగా) సంప్రదాయ కవుల్లో అద్వితీయుడు. అది కవిత్రయం సరసన నిలుపదగినవాడు. పద్య రచనా ప్రక్రియలో ఆయనకు తెలియని మెళకువలు లేవు అక్షరాలా మహాకవి.

**శ్రీ శ్రీ :**

20వ శతాబ్దపు నన్నయభట్టు. వారి రామాయణం కాదు కిన్నెరసాని పాటలు నాకు చాలా యిష్టం.

**డా. సి. నారాయణరెడ్డి :**

ఆ శక్తికి వేయి పడగలు—అంతే.

**డా. వేదుల సూర్యనారాయణశర్మ :**

ఈతడు కవితా వాహినులన్నిటిని తనలో చేర్చుకున్న మహాగభీర సాగరమూర్తి. సాంప్రదాయ కవితలోని అన్ని ప్రక్రియలు ఆతని రామాయణ కల్పవృక్షంలో చూడవచ్చును. కిన్నెరసాని పాటల్లో మహోజ్జ్వలమైన బావుకత కన్పిస్తుంది. అతని వచన శైలి ఒక ప్రత్యేక విశిష్టతను సంతరించుకుంది. శైలి శుద్ధ గ్రాంధికమైనను వ్యావహారికమా ! అని అనిపించును. సంస్కృతములో వలె క్రియాపదములు చివరనకాక, మొదటిలో ప్రయోగించడంలో ఒక నూత్నత తెలియబరుస్తుంది. ఇన్ని ప్రక్రియలు ఒకరిలోనే కన్పించుట ఒక్క విశ్వనాథలోనే సంభవించింది.

## 10. శ్రీ శ్రీ :—

**డా. సి. నారాయణరెడ్డి :**

అభ్యుదయ కవిత్వానికి యుగకర్త.

శ్రీ శ్రీ :

ఈ శతాబ్దానికి పర్యాయపదం. కవితా సృష్టికి పరిశోధన కేంద్రం.

కుందుర్తి :

యుగకర్త. మహా శాబ్దికుడు. వైచిత్రీ ప్రియుడు.

డా. దివాకర్ల వేంకటావధాని :

మహాప్రస్థానము నే నెన్నోమార్లు చదివితిని. ఆయన ప్రతిభ నా కాశ్చర్యము కల్గించినది.

గుంటూరు శేషేంద్రశర్మ :

అభ్యుదయ కవితోద్యమం విస్పష్ట రూపురేఖలు పొందటానికి కర్త. కవిగా సామాన్యుడు, వ్యక్తిగా అవకాశవాది. ప్రజల్లో అజ్ఞానం, విద్యావంతుల్లో అవినీతి కలిసి కల్పించిన సాహిత్య స్థానాన్ని అనుభవిస్తున్న గొప్ప తెలుగు అదృష్టవంతుడు.

నార్ల వేంకటేశ్వరరావు :

శ్రీ అంటే నానార్థాలున్నాయి; లక్ష్మి మొదలు విషం వరకు. శ్రీ శ్రీ అంటే మాత్రం ఒకే అర్థం – అది విప్లవాత్మక కవిత్వం.

## 22. కాళోజీ :–

గుంటూరు శేషేంద్రశర్మ :

తెలంగాణా శ్రీ శ్రీ అనడంలో అతిశయోక్తిలేదు.

డా. దివాకర్ల వేంకటావధాని :

వీరు సులభముగా, సూటిగా చెప్పగల ప్రజాకవి.

కుందుర్తి :

ప్రజాకవి. తెలుగు పలుకుబడి తెలిసినవాడు.

శ్రీ శ్రీ :

మన వేమన. మన గొడవంతా అతని గొడవ.

డా. సి. నారాయణరెడ్డి :

ఆయన 'గొడవ'కు ఆవేదన జీవం. అధిక్షేపం రూపం.

## 12. గుంటూరు శేషేంద్రశర్మ :—

డా. సి. నారాయణరెడ్డి :

పద్యంలో శిరస్త్రి వచన కవితలో విహరిస్తున్న లలిత భావుకుడు.

శ్రీ శ్రీ :

కవి సేనానాయకుడు. కానీ అతని సైన్యం శాల్వేషన్ ఆర్మీలాంటిది. చెప్పుకోదగ్గ కవి.

కుందుర్తి :

అభినవ భావకవి.

డా. దివాకర్ల వేంకటావధాని :

శర్మగారు ప్రతిభా వ్యుత్పత్తులకు తగిన ఛందోబద్ధమైన గొప్ప కవిత్వము చెప్పగల కవి. ఆయన వేరు మార్గము ననుసరించు చున్నారని నే ననుకొను చున్నాను.

గుంటూరు శేషేంద్రశర్మ :

నేను కవినికాను. కఠోర వ్రతాన్ని, వ్యక్తినికాను ఉద్యమాన్ని.

## 13. సర్, సి. ఆర్. రెడ్డి :—

గుంటూరు శేషేంద్రశర్మ :

ఆంధ్ర మహాపురుషులలో ఒకడు - మహా మేధావి.

డా. దివాకర్ల వేంకటావధాని :

వీరి కవిత్వమున 'ముసలమ్మ మరణము' ఒక్కటే నేను చదివితిని. అందలి భావము నూత్నము, భాష కవిత్రయము నాటిది.

కుందుర్తి :

ఈ జాబితాలో ఈయనెందుకు? విమర్శలో కొత్తపుంతలు తొక్కినాడనా?

శ్రీ శ్రీ :

ఆధునిక విమర్శకు మార్గదర్శకుడు. ఎన్నో దురభిప్రాయాలను తూర్పార బట్టిన వాడు.

డా. సి. నారాయణరెడ్డి :

ఆధునిక తెలుగు సాహిత్య విమర్శకు పాదులు వేసిన విజ్ఞ రసజ్ఞుడు.

## 14 పుట్టపర్తి నారాయణాచార్యులు :—

డా. సి. నారాయణరెడ్డి :

కవిత్వాన్నీ, పాండిత్యాన్నీ కలగలిపి ఆపోశనంపట్టిన అగస్త్యుడు.

శ్రీ శ్రీ :

కవి పండితుడు; పండితకవి. రాయలసీమ ప్రసాదించిన రత్నం.

కుందుర్తి :

చాలా భాగం సంప్రదాయ ప్రియుడు.

డా. దివాకర్ల వేంకటావధాని :

గేయమును, పద్యమును సమముగా నడపగల ప్రతిభా వంతుడైన మహాకవి.

గుంటూరు శేషేంద్రశర్మ :

గొప్పకవి. గొప్ప విద్వాంసుడు. అన్నిటికంటె మించి మానవత్వం తొణికిసలాడే మహావ్యక్తి.

## 15. రాయప్రోలు :—

**డా. దివాకర్ల వేంకటావధాని :**

ఆధునిక కవిత్వమునకు ఆచార్యులు. చిన్నవైనను ఆయన కావ్యములు నాకు మనోహరములుగా నుండును.

**కుందుర్తి :**

భావ కవితాచార్యుడు. కొత్త కోసం పరితపించినవాడు.

**శ్రీ శ్రీ :**

భావ కవిత్వానికి ప్రపితామహుడు. మరచిపోయిన తెలుగుతనాన్ని మళ్ళీ జ్ఞాపకం చేసినవాడు.

**డా. సి. నారాయణరెడ్డి :**

భావ కవిత్వంలోని అన్ని శాఖలకూ ఆచార్యుడు

**గుంటూరు శేషేంద్రశర్మ :**

వీరిగొంతు వెయ్యేళ్ళ పారంపరిక పంథాను బద్దలుచేసి, "ప్రసిద్ధాభిధాన వ్యతిరేకిణీ విచిత్రైవాభిధా" స్వరంతో "వైదగ్ధ్య భంగీ భణితి" తో ఒక నూతన ప్రపంచ ద్వారాలవైపు ఆంధ్రావళిని ఆహ్వానించింది. రాయప్రోలు తొలకరి ఉపమలు తెలుగు నేలమీద వెదజల్లిన రాగ రాగిణుల్లో తడిసి తెలుగు కవిత్వ భాషా స్వరూపమే మారిపోయింది. ఆయన సృష్టించిన ఐంద్రజాలిక రచనా ప్రపంచం తత్పూర్వం తెలుగులో లేదు. అలాంటి మనోజ్ఞ శబ్ద ప్రయోగ వైఖరి తత్పూర్వ కాలానికి పూర్తిగా అపరిచితం.

తన లేఖినిని ఒక మంత్రదండంలా ప్రయోగించి సాధారణ వ్యవహార భాషని అత్యంత సమ్మోహక సాహిత్య భాషగా ఎలా మార్చాడో చూస్తే, ఈ మహా పురుషుడు వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యం [illegible] ఒక పద్మపీఠం చేసుకుని కూర్చొన్న సాక్షాత్తు చతుర్ముఖ బ్రహ్మగా దర్శనమిస్తాడు.

## 17 (A) ఆరుద్ర :

మీరు వేసిన ఈ పెద్దప్రశ్నకి సమాధానంగా నా సమగ్రాంధ్ర సాహిత్యం

అధునిక యుగంలోని కొన్ని అధ్యాయాలను ఇప్పుడే రాయమంటున్నారు. ఇది శ్లావ్యం కాదు.

ఐతే ఒక్క మాట మాత్రం చెప్పాలి గురజాడ ఆధునిక సాహిత్యాన్ని సృష్టిస్తే, సి. ఆర్. రెడ్డి ఆధునిక కవితా దృక్పథాన్ని మనకి వివరించాడు.

డా. దాశరథి :

నేనుతప్ప మీరిచ్చిన పేర్లలో అంతా వారి వారి రంగాలలో గొప్పవారు.

17. (B) భావ కవిత్వం, దిగంబర కవిత్వం, అభ్యుదయ కవిత్వం—
నేటి రచయిత్రులు—వారి రచనలు, సాహిత్య పోషణలో
ప్రచార సాధనాల పాత్ర—
—మీ అభిప్రాయం ఖచ్చితంగా చెప్పండి లేదా
విమర్శించండి.

డా. దాశరథి :

ఏమీ వ్రాయలేను.

ఆరుద్ర :

ప్రచార సాధనాలు సాహిత్య విస్తరణకు చాలా అవసరం. ఘంటసాల పాడకపోతే కరుణశ్రీ పద్యాలకు అంత ప్రచారం వచ్చి వుండేదికాదు. సాహిత్యానికి గ్రామఫోను రికార్డులు కూడా ఒక ప్రచార సాధనమన్నది యీ విషయంలో ఒక రికార్డు.

నేటి రచయిత్రుల్లో కొంతమంది తమ విలక్షణత్వం, ప్రత్యేకత రుజువు చేసుకుంటున్నారు.

గుంటూరు శేషేంద్రశర్మ :

రాయప్రోలు అభినవ కవితాయుగ మహా వాహినికి మూల స్రోతస్సుగా ఎక్కడో హిమాలయ శృంగ సీమల్లో అమలిన వినీలాకాశాల ఒడిలో మంచు శిలల్లో, పూల భూముల్లో, అరుదైన వాయు కెరటాల్లో, బిలబిల స్రవించే సొన

అయిన గంగోత్రి అయితే నండూరి, జాషువా, కృష్ణశాస్త్రి (విశ్వనాథ) లు అందులో నించి పుట్టి, పాయలై పారిన ఉపనదులు. నండూరి, జాషువా లిద్దరూ రాయప్రోలు అనే స్వచ్ఛ శీతల జల స్రోతస్సు తరగల్లో జలకాలాడే రెండు రంగుల చేపలు. ఈ ఇద్దరూ అభినవకవితకు ఆయుర్వేద మహిమనిచ్చిన అశ్వినీ దేవతలు. ఇక విశ్వనాథ మాత్రం శృంగార వీథి, ఆంధ్ర ప్రశస్తి, ఆంధ్ర ఋతువులు అనే రచనల్లో అభినవ కవితాశాఖా కోకిలల్లో ఒక కోకిలగా గొంతెత్తి, మాస్వామి, కుమారాభ్యుదయము ప్రభృతి రచనల ద్వారా క్రమశః రామాయణ కల్పవృక్షము చేరే సరికి-ఆయన భావ కవిత్వమనే ఒక మహా రమణీయ సృష్టి రాశిని చాపగాచుట్టి మోసుకుపోయి పూర్వ కవిత్వాంభోధిలో విసిరి పారేసిన సంహారకర్తగా రౌద్రావతారమూర్తిగా భాసిస్తాడు. విశ్వనాథ తర్వాత భావ కవిత్వం లేదు; భస్మమైపోయింది. నేటి రచయిత్రుల రచనలు అశేష ప్రజానీకం చదువుతున్నారు. కానీ వాటిలో గుణం అంతగాలేదన్న అపప్రథ కూడా వుంది. వాసిరెడ్డి సీతాదేవి నా అభిమాన రచయిత్రి.

డా. దివాకర్ల వేంకటావధాని :

దిగంబర కవిత్వము నే నెక్కువగా చదువలేదు. అభ్యుదయ కవిత్వము నందలి భావములు నాకిష్టమేకాని వ్యక్తీకరణము వైముఖ్యము కలిగించుచున్నది.

రచయిత్రుల రచనలు నేనేమియు చదువలేదు. రేడియో, పత్రికలు, సాహిత్య ప్రచారమున కంటె వ్యక్తి ప్రచారమున కెక్కువ తోడ్పడుచున్నవి.

డా. సి. నారాయణరెడ్డి :

భావ కవిత్వం :— ప్రబంధ పంజరం నుంచి విడివడి, వస్తువులో, భావంలో, పద ప్రయోగంలో కొత్త రెక్కలు తొడుక్కున్న కవితా ప్రక్రియ.

దిగంబర కవిత్వం :— అప్పటికి అవసరమనిపించిన 'షాక్' పొయిట్రీని, 'జోక్' పొయిట్రీని రెండు చేతులతో గుప్పించి, తెర మరుగై పోయిన విచిత్ర కవితా ప్రక్రియ.

అభ్యుదయ కవిత్వం :— సామ్యవాదాన్ని సాధ్యమైనంత సూటిగా ప్రబోధించిన కవితా ప్రక్రియ.

నేటి రచయిత్రులు, వారి రచనలు :— స్థూలంగా చెబితే, సాహిత్యాన్ని నవలల రూపంలో అసంఖ్యాక పాఠకులు చదవటానికి దోహదం చేసినవారు.

ప్రచారసాధనాలు :— నాటిక, కవిత, కథానిక, నవల, విమర్శ - ఈ ప్రక్రియ లన్నిటికీ సముచిత స్థానం కల్పిస్తున్న వేదికలు.

శ్రీ శ్రీ :

భావ కవిత్వం Upper Middle Class, దిగంబర కవిత్వం Lumpen Ploletarian, అభ్యుదయ కవిత్వం Lower Middle Class.

నేటి రచయిత్రులు - వారి రచనలు :— బీనాదేవి, రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి - ఏ రచయితకు తీసిపోనివారు. ఈ ముగ్గురిలోను నేను చెప్పిన నిబద్ధత వుంది.

ప్రచార సాధనాలు :— నేటి ప్రచార సాధనాలు బూర్జువా సాహిత్యాన్నే పోషి స్తున్నాయి ఒక్క పత్రికలలో మాత్రమే 'సృజన' వంటివి పాఠకులలో ఆలోచనని రేకెత్తిస్తున్నాయి.

కుందుర్తి :

భావ కవిత్వం సంప్రదాయ కవిత్వానికి తోక మాత్రమే. ఆశించిన నవ్యత్వం రాలేదు. అన్నీ పూర్వ ప్రమాణాలనే ఆదరించింది. అందుకే 25 సంవత్సరాల్లోనే వెనుకడుగువేసింది. అభ్యుదయ కవిత్వం నిజమైన కవిత్వం. ప్రజాదృష్టితో రాసే కవిత్వం. దిగంబర కవిత కసిని తీవ్రంగా ప్రకటించింది. ఒక ఊపు వూపింది.

నేటి రచయిత్రుల నవలలు నే నెక్కువగా చదవలేదు. ఒక రిద్దరూ మినహా మిగిలిన వారందరూ సినిమాదృష్టితో రాస్తున్నట్టుగా వుంది. వీరి నవలలను గురించి తక్కువ స్థాయిలో వున్నాయని రచయితలు అంటుంటారు. కాని ఏదో రకంగా యింతమంది స్త్రీలు రంగంలో ప్రవేశించి, విజృంభించి రాస్తూవుండడం మంచిదే. దీనిలో మాత్రం మగవారి మనోపలీ ఎందుకు ?

17. (C) ఈ క్రింది రచనల్ని గురించి మీ అభిప్రాయం ఖచ్చితంగా చెప్పండి లేదా విమర్శించండి :

1. ఏకాంతసేవ .—

గుంటూరు శేషేంద్రశర్మ :

దీనిలో శబ్ద మాధుర్యం వుంది. భావన సుకుమారం.

డా. సి. నారాయణరెడ్డి :

రక్తికీ, భక్తికీ వంతెన వేసిన భావగీతం.

శ్రీ శ్రీ :

కవితా జలపాతం.

౨. కష్ట కమల :—

శ్రీ శ్రీ :

కవిత్వంలో కథానిక.

డా. సి. నారాయణరెడ్డి :

విషాదాన్ని రసాత్మకంగా రూపొందించిన కావ్యం.

డా. దివాకర్ల వేంకటావధాని :

చక్కని కావ్యము.

గుంటూరు శేషేంద్రశర్మ :

అపూర్వ శబ్దావళితోపాటు ఒక అపూర్వ భావనా ప్రపంచాన్ని సృష్టించిన కావ్యం.

౩. త్వమేవాऽహం:—

గుంటూరు శేషేంద్రశర్మ :

దీన్ని సాహిత్యంలో కవిత్వ వర్షపు చుక్క పడని కరువు ప్రాంతంగా చెప్పాలి.

డా. సి. నారాయణరెడ్డి :

ఆద్యంతం చమత్కారాన్ని, కొత్తదనాన్ని నింపుకున్న కవితాప్రయోగం.

శ్రీ శ్రీ :

నిప్పులు చిందే నిరాశావాదం.

కుందుర్తి :

టెక్నిక్ వచ్చి యితర కవితా లక్షణాలన్నిటినీ మింగేసిన పరిస్థితి. ఇది నాకు నచ్చదు.

## 4. మహాప్రస్థానం :—

శ్రీ శ్రీ :

జన జీవితపు Still Photography.

డా. సి. నారాయణరెడ్డి :

మరెన్నో కవితా ప్రస్థానాలకు దారి తీసిన తొలి గర్జన.

డా. దివాకర్ల వేంకటావధాని :

నాకు చాల నచ్చినది.

గుంటూరు శేషేంద్రశర్మ :

అభ్యుదయ కవిత్వానికి జెండా.

## 5. రామాయణ కల్ప వృక్షము :—

గుంటూరు శేషేంద్రశర్మ :

కవితా సరస్వతి బహు భంగిమల్లో ముస్తాబు చేసుకుని నర్తించిన నాట్యభూమి

డా. దివాకర్ల వేంకటావధాని :

ఇటువంటి కావ్య మెప్పుడో కాని పుట్టదు.

డా. సి. నారాయణరెడ్డి :

రామ కథలోని జీవ లక్షణాన్ని విశ్లేషించిన మహాకావ్యం.

శ్రీ శ్రీ :

ఒక గొప్ప తెలుగు నవల.

కుందుర్తి :

సంప్రదాయ కవిత్వంలో శిఖరం వంటిది. తిక్కన తర్వాత విశ్వనాథే.

## 6. ఎంకి పాటలు :—

డా. దాశరథి :

నాకు చాలా ఇష్టం.

శ్రీ శ్రీ :

పాటక జనుల భావ కవిత్వం.

డా. సి. నారాయణరెడ్డి :

యాస మాటల్లో కవిత్వం రాశి పోసిన రసకణికలు.

డా. దివాకర్ల వేంకటావధాని :

ఆధునిక గేయ ప్రబంధము.

గుంటూరు శేషేంద్రశర్మ :

భావ కవిత్వ జగత్తుకు చెందిన కావ్యమాలలో మణిపూస. నండూరి ఎంకి పాటలు లేని భావ కవిత్వం అసమగ్రమై సత్య దారిద్ర్యానికి గురి అవుతుంది.

## 7. వజ్రాయుధం :—

గుంటూరు శేషేంద్రశర్మ :

అభ్యుదయ సాహిత్యయుగాన్ని శిల్పించిన మహత్తర సాధన సంపత్తిలో ఇది ఒకటి.

డా. సి. నారాయణరెడ్డి :

ప్రగతి శీల దృక్పథాన్ని ప్రబలంగా చాటిన గేయసంపుటి.

శ్రీ శ్రీ :

తెలంగాణా పోరాటానికి వ్యాఖ్యానం.

8. ముత్యాల సరాలు :—

శ్రీ శ్రీ :

భావి కవిత్వానికి చూపుడు వ్రేళ్లు.

డా. సి. నారాయణరెడ్డి :

జీవిత సత్యాలను ముత్యాలను అందంగా, కత్తి అంచంత నిశితంగా వెలువరించిన వినూత్న ప్రయోగాలు.

డా. దివాకర్ల వేంకటావధాని :

మాత్రా ఛందస్సులో వ్రాయువారికి వరప్రదానము.

గుంటూరు శేషేంద్రశర్మ :

అభ్యుదయ దృక్పథ తేజో మండలం దర్శన మిస్తుంది. కవిత్వపు పాళ్ళు తక్కువ.

9. మండే సూర్యుడు :—

గుంటూరు శేషేంద్రశర్మ :

నా సుఖ దుఃఖాల మేలా; నా అనుభూతుల తిరునాల. కానీ 'నా దేశం- నా ప్రజలు' లోనే నా స్వప్న జగత్తంతా పూర్ణావతారం పొందింది.

డా. సి. నారాయణరెడ్డి :

అనుభూతికీ, అభ్యుదయ భావనా రీతికీ గీసిన భావ చిత్రాల సంపుటి.

శ్రీ శ్రీ :

శేషేంద్ర నీలం. ఆవేశంలో ఆరాటం.

10. ఖడ్గ సృష్టి :—

శ్రీ శ్రీ :

అధర్మ నిధనానికి.

డా. సి. నారాయణరెడ్డి :

ఆత్మవాదం, అనువాదం కలగలిపిన మరో సృష్టి.

గుంటూరు శేషేంద్రశర్మ :

ఇందులో ఖడ్గమూ లేదు సృష్టీ లేదు.

11. గుడిసెలు కాలిపోతున్నాయి :—

గుంటూరు శేషేంద్రశర్మ :

మానవీయ దృక్పథం స్పందిస్తున్న రచన.

డా. సి. నారాయణరెడ్డి :

అభిప్రాయ తీవ్రత, ఆర్ద్ర భావుకత పెనవేసుకున్న కవితలు.

శ్రీ శ్రీ :

బూడిద మిగుల్తుంది.

18. వ్యక్తినిబట్టి గాని, ప్రక్రియనుబట్టి గాని ఆధునిక సాహిత్యాన్ని పరిశీలిస్తే అసందిగ్ధంగా వుంది — కాబట్టి దీనికి మీరేదైనా పేరు సూచిస్తారా ?

డా. దాశరథి:

"అభ్యుదయ యుగం" అనవచ్చు.

ఆరుద్ర :

ఆధునిక సాహిత్యంలో అసందిగ్ధత నాకేమీ కనిపించటం లేదు. నేను చూడంది ఏదైనా వుంటే ఆ 'అసందిగ్ధత యుగ' లక్షణం కావచ్చు.

కుందుర్తి :

నాలాంటివారి జవాబులు చాలా వస్తాయి గదా. అన్నీ చదివి మీరే ఏమైనా తోస్తే సూచించండి.

శ్రీ శ్రీ :

విషయం తెలిసిన విమర్శకులతో పాటు నేను కూడా ఆధునిక సాహిత్యాన్ని "శ్రీ శ్రీ యుగం" అనమంటున్నాను.

డా. సి. నారాయణ రెడ్డి :

కవిత్వం ఎప్పటికప్పుడు కొత్తదనాన్ని కోరుకొంటుంది. ఆ అన్వేషణలో సాగుతున్న కవిత్వమే ఆధునిక కవిత్వం. వ్యక్తిని బట్టి, ప్రక్రియను బట్టి సమకాలీన కవిత్వాన్ని బేరీజు వేయడం ఎప్పుడూ ఉన్నదే. దాన్ని ఎలాకాదనేది? అది అలా ఉంటూనే — నేటి కవిత్వాన్ని ఒకే పేరుతో పిలవ మంటే — 'ఆధునిక కవిత్వం' అనే అంటాను ; మళ్లీ మళ్లీ.

డా. దివాకర్ల వేంకటావధాని :

అన్ని లక్షణములు సరిపోవునట్లుగా పేరు సూచించుట చాల కష్టము. ఏ పేరైనను పాక్షికముగనే ఉండును. కానీ దీనిని "స్వేచ్ఛా కవితా యుగము" అన వచ్చును.

గుంటూరు శేషేంద్రశర్మ :

సాహిత్యయుగ విభజన మొదట సాహిత్య కళాను సారంగా చెయ్య బడాలి. రెండవది సాహిత్యంలో సామయికంగా మారే సామాజిక, ఆర్థిక, విలువల ప్రాధాన్యాన్ని విభజన చేసే పద్ధతి, జరిగే చర్చలు, తత్సంబధమైన వ్యవహారమంతా ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాల్లో కూలంకష పరిశీలనకు, చర్చకు వస్తాయి. కనక సాహిత్య విభజన సందర్భంలో మళ్లీ అన్య రంగాలకు సంబంధించిన విషయ ప్రాధాన్యాన్ని సాహిత్యరంగం మీద రుద్దటం అంత సమంజసంగా కనిపించదు. సామాజిక, ఆర్థిక విలువల మార్పులు సాహిత్యంలో తెచ్చిన కళాత్మక మార్పుల్ని ఆధారం చేసుకుని మాత్రమే సాహిత్య విభజన చేయటం సహేతుక మవుతుంది,

అట్లా చూస్తే తెలుగు సాహిత్యాన్ని చెయ్యవలసిన శాస్త్రీయ విభజన :

1. వాచ్యార్థ ప్రధాన యుగం (నన్నయ నుంచి తిరుపతి కవుల వరకు)
2. లక్షణార్థ ప్రధాన యుగం (రాయప్రోలు నుంచి కరుణశ్రీ వరకు)
3. ద్వితీయ వాచ్యార్థ ప్రధాన యుగం (శ్రీ శ్రీ నుంచి కుందుర్తి వరకు)

4. ద్వితీయ లక్షణార్థ ప్రధాన యుగం. (క్షేమేంద్రతో ప్రారంభించి ఇప్పుడు నడుస్తున్న కవిసేన యుగం వరకు)

కానీ స్థూలంగా రాయప్రోలు నుంచి యీనాటి వరకు ఆధునిక యుగమనే అనుకోవాలి. (చూ. కవిసేన మేనిఫెస్టో – పేజి 282)

**డా. వేదుల సూర్యనారాయణశర్మ :**

అసందిగ్ధంగా ఉందన్నారు కాబట్టి పేరు సూచించు ఆవశ్యకత నాకు కనిపించడం లేదు.

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి అభిప్రాయాలు

### ఆధునిక కవిత్వం గురించి :

ఆధునిక కవిత్వం వేరు – నేను మొదలు పెట్టిన అభినవ కవిత్వం వేరు. రస స్వరూపం. ఛందో నిర్వహణలో తేడా వుంది. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు బర్హంపూర్‌లో 'అభినవ పండిత సభ' అని పేరు పెట్టి ఓ సభ జరిపించారు. దాంతో 'అభినవ కవిత్వం' అని నేనో కొత్త దారి తొక్కాను. రెండో సభ రాజమండ్రిలో జరిగింది – నేను వెళ్లాను. కానీ చాలా భయ పడ్డాను. ఎందుకంటే – అక్కడ ఇతర పండితులకి తాటాకులు కట్టేవారు. చిలకమర్తి వారు వచ్చిన తర్వాత అది పోయింది. అభినవ కవిత్వం వచ్చిన తర్వాత "రసో వై సః" అనేది మళ్లీ బయటకి వచ్చిందన్నారందరూ.

### స్వీయ కవిత్వ సిద్ధాంతం గురించి :

నా కవిత్వం – శ్రుతి, స్మృతి, కృషి—సంగమం. ఛాందసం వదలిపెట్టి రమణీయార్థాలతో, హ్లాదైక మయిన కావ్యమంటూ రాసుకు పోయాను. నేను త్రోవ తప్పాను. ఒక విలక్షణత కోసం తపించాను.

ముట్నూరి వారు నా 'తృణ కంకణం' మీద ఎనిమిది కాలంల ఆర్టికల్ రాశారు. అందులో జర్మన్, ఇంగ్లీషు, సంస్కృత భాషా కవిత్వాల కలగూర గంపగా వుందని, ఈ కవిత్వం *Higher Poetry* కి త్రోవ తీస్తుందని, ఇందులో శబ్దార్థాల కంటె భావార్థాన్ని అర్థం చేసుకోవాలని రాశాడు. అంతే కాదు 'ప్రేమకు ప్రధానస్థాన మిస్తాడితఁ' డని కూడా రాశాడు. రామచంద్ర

శుద్ధేంద్ర లా నేను ప్రేమకే ప్రాధాన్యం ఇచ్చాను ఈ ప్రేమని ఎంత వరకు తీసుకుపోయానంటే — "పూర్ణమదః పూర్ణమిదం" అన్న వేద వాక్యాన్ని 'ప్రేమ మదః ప్రేమమిదం' అని అన్నాను. అదలా వుంచండి. సద్యః పరనివృతి — అంటే కేవలం ఆనందం కాదు. ఒక కవిత్వంలో మనం గ్రహించటానికి ఏమైనా వుందా ? అన్నదే ప్రశ్న. ఆ అన్వేషణే నా తత్త్వం. మానవతా వాదం శుచిగా వుండాలన్నది నా సిద్ధాంతం. ఏ కవిత్వమైనా అంతే.

ఆధునికుల చిత్తశుద్ధిని గురించి :

మోడరన్ ఇన్టలెక్ట్ ఎంత కీన్‌గా వుందో అంత ఓపిక లేదు. ఇది తప్పు కావచ్చు. అంతేకాదు వీళ్ల బుర్రలో స్క్రూ లూజై పోయింది. గట్టిగా బిగించే వాడు లేడు.

ఆధునిక కవితా ధోరణుల పరిపుష్టత గురించి :

సమాజంలో స్త్రీ పురుషులు నవ్వుతూ, తుళ్లుతూ మాట్లాడటానికి వీల్లే కుండా సెక్సు వచ్చింది. దాన్ని అరికట్టడానికి చూశాను. కావ్యరసం — నిమ్మ పండు, మామిడిపండు రసం వంటిది కాదు, వస్తు జన్యం కాదు. దాన్ని నేను 'అవ్యక్త' మన్నాను. వేదంలో గాయత్రిని "జ్యోతిః రసోఽ మృతం బ్రహ్మ" అన్నదే నేనూ గ్రహించాను. ఆ రసానికి విలువిచ్చాను. దేనికైనా ఒక ఆధారం ఉండాలి కదా ! ఇప్పు డే గొడవా లేదు. ఏది తోస్తే అది ! నిజానికి అనుభూతి లేకపోతే కవిత్వం కాదు. అదీ లేదు — ఇంక పరిపుష్టి ఏమిటి ?

ఔచిత్యాన్ని గురించి :

కవి అన్నవాడు దేన్నయినా చెప్పవచ్చు. ఐతే ఎలా ? అన్నదే ప్రశ్న. బెజవాడ గోపాలరెడ్డి తండ్రి, కట్టమంచి రామలింగారెడ్డి "కచ కుచాలు లేకుండా శృంగార రసాన్ని పోషించిన వాడివి నీ వొక్కడివే" అన్నారు. నా ప్రయత్నం కూడా అదే. ఒక్క విషయం చూడండి ; శృంగారం స్త్రీ పురుషులకి మూత్ర స్థానాల్లో పెట్టాడు; అత్యంత అసహ్యకరమైన స్థానాలు — కానీ అక్కడ ఏం చేశాడంటే—ఇవన్నీ అక్కడ అప్పుడు మర్చిపోయే ఏర్పాటు చేశాడు. అంతేకాదు, "తస్య పరమాత్మా వ్యవస్థితః" — అలాంటి శృంగార భావాన్నే 'అశరీరగంగా' అన్నారు. దీనికే వేదంలో శారీర మీమాంస అని పేరు పెట్టారు. సృషిలో గానీ

కవితాసృష్టిలోగాని యీ విషయాన్ని గ్రహిస్తే చాలు. మిగిలిన జుగుప్స లన్నీ యీ దర్శనంలో లీనమైపోతాయి.

## ప్రాచీన సాహిత్య పరిచయాన్ని గురించి :

ఆధునికులకు ప్రాచీన సాహిత్యాన్ని తెలుసుకోక పోవటం — కన్న తల్లి దండ్రుల్ని వదలి పెట్టటం లాంటిది. కాళిదాసంతటి వాడు "జగతః పితరౌ వందే" అన్నాడు. ఈస్తటిక్స్, ఎరోటిక్స్-ల్ని గురించి మా గురుదేవుడు రవీంద్రనాథ ఠాగూరు మాకు చాలాసార్లు చెప్పాడు; మేమా త్రోవలో పడ కూడదని. కాదంబరి పచ్చి శృంగారం — అదంతా ఈస్తటిక్సు లోంచి వచ్చింది — పట్టలేదు.

## వచన కవిత్వాన్ని గురించి :

వచన కవిత్వం మీద నా అభిప్రాయం అడగొద్దు. అది నేను ఫాలో కాలేదు. ఆధునిక కవిత్వం — it is more comprehensive. ఒక్కమాట. శ్రీ శ్రీ గొప్పవాడు. అతనితో నా కంత పరిచయము లేదు. నా ఫ్రెండు ఎంకి పాటల సుబ్బారావు కి అతనితో సన్నిహితం. శ్రీ శ్రీ కవిత్వం యొక్క కొస లైనా అందుకో గలిగారా యీ రాసే వాళ్లంతా — అందుకుంటే బాగుంటుంది.

## కవిత్వంలో శిల్పాన్ని గురించి :

కవితా శిల్ప మంటే— ఇదిగో శాకుంతలం చూడండి:- మీకే తెలుస్తుంది. శిల్పమనేది భావాన్ని బట్టి అఖరుకి నిలుస్తుంది. విశ్వామిత్రుడు మహర్షి, కుల పతి — మేనక దేవత. దేవతలకి *free love* వుంది, దాంపత్యం లేదు. ఉంటే బిడ్డలు పుట్టి వుందురు. ఈ *free love* మనకి కూడా ఉపనిషత్తుల కాలంలో వుంది. జాబాలి కథ చూడండి. కాబట్టి స్త్రీ పురుషులకి ఒకానొక దశయందు 'తరుణాపేక్ష' అనేది కల్గుతుంది. దాన్ని ఏకాంతంగా, రహస్యంగా, పవిత్రంగా, - శకుంతల - దుశ్యంతుల విషయంలో కూడా కాళిదాసు చెప్పాడు. అదే శిల్పం. ఈ కవిత్వ శిల్పం శకుంతలను పంపించే టప్పుడు బైట పడింది. "శకుంతలేమ హృదయం సంస్పృష్ట ముత్కంఠయా" అన్నాడు. ఇక్కడ 'ఉత్కంఠ' శబ్దాన్ని కాళిదాసు చాలా జాగ్రత్తగా వాడాడు. ఇది వేదన, శోకం, ఆర్తి. ఇదంతా కలిస్తే తన్మయత్వం. అలా కావ్య శిల్పం చూపెటాడు.

మరో విషయం చూడండి : దుష్యంతుడు వచ్చి కణ్వాశ్రమంలో శకుంతల్ని చెయ్యరాని పని చేసి పోయాడు. దాన్ని ఏ విశ్వామిత్రుడో, దుర్వాసుడో అయితే వాడి వంశం నాశనం చేసేవారు. కానీ శిష్యుల్తో కణ్వుడు "తపో సంయమనః" అన్నాడు. దాన్ని లాగితే సాంత్వనం దగ్గరకి వస్తుంది. ఆ శిల్ప రహస్యాన్ని గ్రహించాలి.

భాసుడు 'వాసవదత్త'లో స్త్రీ పురుషుల్ని ఒక శయ్యమీద పడుకో బెడతాడు. 'ప్రమదావనం' లో కూడా అంత పనీ చేశారు. ఆ విషయం చెపితే గానీ తెలియదు. ఆ రహస్య సౌందర్యమే శిల్పమంటే'.

## స్వీయ రచనల్ని గురించి జ్ఞాపకాలు :

పది కాలాల పాటు నిల్చే పుస్తకం — అంటే ఒక్కమాట. నా 'రమ్యాలోకం గురించి గిడుగు రామ్మూర్తి "రమ్యాలోకం వంటి పుస్తకం ఇంకోటుందా ? తెలుగులో వచ్చిందా ?" అన్నాడు. కాబట్టి కవిత్వ దృష్టిని బట్టి, భావాన్ని బట్టి నిల్చే అలాంటి పుస్తకం వుందా మరి !

కట్టమంచి రామలింగారెడ్డిగారు సహృదయుల్లో చాలా గొప్పవారు. ఆయన నా 'తృణ కంకణం' చదివి — "నీ తృణ కంకణం *would be literature* కి *preface* లాగా వుంది" అన్నాడు. ఒకనాడు రెడ్డిగారు — "నీ పొయిట్రీలో ఫెంటాస్టిక్ బ్యూటీ ఎలా వుంటుందో చెప్పు" అని అడిగారు.

"కన్యకా మాలతికలు పుష్పించె
రసీభవించె శుచి శృంగారమై
చరాచరములు రాగిల్లె తరుణాపేక్షతో
సయ్యాటలకై ఉయ్యాల లూగె"

అంటూ కొన్ని రాసి చూపెట్టాను. "శృంగార శ్శుచి రుజ్జ్వలః" అన్నాడు అమరుడు. "రసీభవించె శుచి శృంగారమై" — రెడ్డిగారు తబ్బిబ్బై పోయాడు. రెడ్డి గారితో నా సంబంధం, భమిడిపాటి లాంటి వాళ్ల వేసిన ప్రశ్నలు, నా సమాధానాలూ నాకు మరుపురావు. చాలా జ్ఞాపకం లేవు — కానీ "రాయప్రోలు సాహసించి చెప్తాడు" అన్నారందరూ.

ఐతే ఒక్క విషయం వుంది—

"కడిగిన కస్తురి పాత్రిక

నుడిగిన పరిమళము వన్నె—" అన్న 'స్వప్నకుమారం' లో *misticism* వుంది. 'రూపనవనీతం' లో అటూ—ఇటూ తేల్చుకో లేని అవ్యవస్థవుంది. నా లోపాలు నేనే చెప్తున్నాను. ఏంచెయ్యాలో తోచలేదప్పుడు

## సందేశాన్ని గురించి:—

సందేశం ఇచ్చే అర్హత నాకు లేదు. ఐతే ఒకటుంది. ఆశ్రమ జీవితం ఎంతమార్పు తెస్తుందో నాకు తెలుసు. కాబట్టి కవికి ప్రశాంతత కావాలి. ఇప్పుడు అది లేదు—అందుకే యీ తొందరపాట్లూ, తప్పులూను.

## 'ఎవరు శ [illegible] కులు?' — గురించి:—

నీకు తెలియదూ ? నా నోటమ్మట ఎందుకు చెప్పిస్తావ్? నేనే మార్గదర్శకుణ్ణని ఆనాటి వాళ్లంతా అన్నారు.

## ఆధునికయుగానికి పేరు గురించి:—

దీనికి 'అభినవ కవితా యుగం' అనిపేరు పెట్టుకోవచ్చును, ఆ నవత్వమేదో అందు లోనే చూడవచ్చును. ఏమంటారు ?.